# వారెవరు?

చీకటి భూమికపై వెలుగును నాటిందెవరు ?
కల్లోల కరీంనగర్ జగిత్యాల పల్లె
జైత్రయాత్రలో
సిరిసిల్లా బరిసెలైందెవరు ?
ఎర్ర పావురాలెగరవేసి మంటల జెండాతో
శత్రువు కోసం .... మాటు ఉన్నదెవరు ?
విశాల 'మనీ' జగత్తును
మినీ కవితలో ఇరికించి
కినుక్కున నవ్వుకొని
అసహ్య సంస్కృతిపై
చురకలు వేసిందెవరు ?
జీవగడ్డ పోరుబిడ్డ —
అమరణాంతం అలుపెరుగని
అలిశెట్టి ప్రభాకర్ !
ఆయనెవరైతేనేం ....
స్మరణ ఒక పోరాట ప్రేరణ కావాలి!
ప్రేరణిచ్చిన వారికి మనమెప్పుడూ ఋణగ్రస్తులమే!

చైతన్య ప్రకాశ్




సంపుటి : 16 సంచిక : 4
ఫిబ్రవరి 1993

రచనలు పంపవలసిన చిరునామా :

**నిర్మలానంద,**
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

**మేనేజర్, ప్రజాసాహితి,**
29-28-67, దాసరివారి వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :

**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.




ముఖ చిత్ర కవిత

అలిశెట్టి ప్రభాకరా
అస్తమించని సూర్యుడా
కన్నీటి బతుకుల కవితలల్లి
కాగితాపై మండినావా

చిత్రకారుడు : ప్రతిన్

రెండవ కవరు పేజీ :
వారెవరు (కవిత)
—చైతన్యప్రకాశ్

మూడవ కవర్ పేజీ :
నమ్మకం మందు కాదు (కవిత)
డా॥ మిరియాల రామకృష్ణ

నాల్గవ కవర్ పేజీ :
సూర్యుడే నా ముఖచిత్రం (కవిత)
—అలిశెట్టి ప్రభాకర్

వెల : రూ. 5 సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100

# ఈ సంచికలో .....




Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.

Working Editor : NIRMALANANDA



ప్రజాసాహితి 134వ సంచిక వర్తమాన భారత రాజకీయాల వాస్తవాల్లోని కుంటి నడకలను విశదీకరించింది. ఇలాంటి వ్యాసాలు చదవకుండా ఎన్ని దైనిక వార్తాపత్రికలు చదివినా నిరర్థకమే అవుతుంది. రాజకీయాల్లో ఉన్నవారు మీ పత్రికను చదివి నేర్చుకోవలసినదెంతో ఉంది. అయితే, వారు చదువుతారా అన్నదే ప్రశ్న. తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు నన్న పద్యం గుర్తొస్తుంది. ప్రజాసాహితి చేస్తున్న నిర్విరామ కృషి జాతికి కనువిప్పు కావాలని ఆశిస్తున్నాను. జనవరి 93, 135వ సంచిక 'ప్రజాసాహితి'లో మథురవాణిపై ప్రత్యేక వ్యాసం నాకు చాల తృప్తినిచ్చింది.

కాకినాడ — మీరా

జనవరి నెల 'ప్రజాసాహితి'లోని సంపాదకీయం బాగుంది. మతోన్మాద శక్తులపై విప్లవ శక్తులు నిర్వహించవలసిన పాత్రను సూటిగా చెప్పారు.

నాగుల్లంక — కె. బాష్టి

మతోన్మాదానికి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం నేటి అత్యున్నత సృజనాత్మక కర్తవ్యం. రచయితలం, సాంస్కృతిక కార్యకర్తల మయిన మనమందరం ఈ కర్తవ్య నిర్వహణలో భాగస్వామ్యం వహిస్తున్నాం.

'ప్రజాసాహితి' ఈ సంచిక (డిసెంబరు 92) కూడా అందులో భాగమనే విషయాన్ని ఆ సంచిక ముఖచిత్రమే చెప్పక చెబుతోంది. మీకు నా శుభాకాంక్షలు.

—రామ్‌కుమార్ కృషక్, సంపాదకుడు,
అలావ్ (హిందీ పత్రిక) న్యూఢిల్లీ.

ఈసారి సంచిక (ప్రజాసాహితి జనవరి 93) లో 'రోజా' సినిమా సమీక్ష బాగా వచ్చింది.

విజయవాడ —అఫ్సర్

ప్రజా సాహిత్యాన్ని అందిస్తున్న ప్రజాసాహితి క్రమం తప్పకుండా వస్తున్నందుకు చాలా సంతోషం. సంపాదకీయాలు, దానికి అనుగుణంగా కవర్ పేజీ బొమ్మలు, పత్రిక మొత్తంలో "మెయిన్ లీడ్" అత్యంత సమకాలీనంగా ఉంటున్నాయి. జనవరి సంచికలో "విప్లవాల దారులంట వెళ్ళమని - పిశాచాలు; విజయా

( తరువాయి 56 వ పేజీ )

# సంపాదకీయం

## ప్రభాకర్ జీవితం వ్యవస్థకు మరణ శాసనం

> My heart aches
> a drowny numbrus pains
> as though I'd drunk hemlock - '
>
> John Keats

ముప్ఫై ఎనిమిదేళ్ళకే మృత్యువాత పడ్డ అలిశెట్టిని తలుచుకోగానే రెండు కారణాలకు జాన్ కీట్సు గుర్తుకొస్తాడు. ఇద్దరూ తమ ముప్ఫయ్యవ పడిలో మృత్యువాత పడ్డారు. ఇద్దరూ ట్యూబర్‌క్యులాసిస్ (క్షయ) తో మరణించారు. అయితే, కీట్స్ జీవితం పట్ల భావవాద దృక్పథం గల కవి. అందుకే కోకిలను సంబోధిస్తూ "ఆకుల పత్రహరితాల్లో ప్రపంచ దుఃఖానికి దూరంగా దాగిన నీకేం తెలుసు ఇక్కడి మా మానవుల నిరంతర రోదన?" అంటాడు. అలిశెట్టికి జీవితం పట్ల, సమాజం పట్ల ఖచ్చితమైన భౌతికవాద దృక్పథం వున్నది. ఈ సమాజ పరిస్థితులకూ జీవన దౌర్భాగ్యాలకూ కారణం దోపిడీ వ్యవస్థ అనీ, రాజ్యాధికారం శ్రామికుల చేతుల్లోకి వస్తేనే గానీ ఈ వ్యవస్థ మారదనీ, మన బతుకులు మారవనీ స్పష్టంగానే అర్థం చేసుకున్న నేపథ్యం అలిశెట్టిది. తన అవగాహననూ దృక్పథాన్నీ అలిశెట్టి తన డైనమైట్ల లాంటి కవితల్లో శక్తివంతంగా కూర్చి ఈ వ్యవస్థ పునాదుల్లో పేల్చాడు. కీట్సు కవితల్లో కనిపించే కరుణాత్మకత అలిశెట్టిలో లేకపోవచ్చు గానీ విప్లవ కాల్పనికత ఆయన ప్రతి కవితలోనూ ఎంతో అర్థవంతంగానూ, శక్తివంతంగానూ పాఠకులను కదిలించి వేస్తుంది.

జగిత్యాలలో 38 ఏళ్ళ క్రితం పేద చేనేత కుటుంబంలో జన్మించిన అలిశెట్టి ప్రభాకర్ యువకుడుగా కళ్ళు విప్పుతున్న సమయంలో సిరిసిల్లాలో, జగిత్యాలలో ప్రజాపంథాలో రైతాంగ పోరాటాలు పుప్పెత్తున కెరటాలై ఎగసినవి. నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలనుండి గుణపాఠాలు తీసుకుని విప్లవ రాజకీయ పంథాను ప్రజా పోరాటాలకు శాస్త్రీయంగా అన్వయించి నిర్మించిన రైతాంగ పోరాటాలు నవయవ్వనంలో రెక్క విప్పుతున్న యువతరాన్ని తీవ్రంగా ప్రభావితం చేసినయి. భావుకుడై, కళాత్మక దృష్టి వున్న అలిశెట్టి ప్రభాకర్ కవిగా చిత్రకారుడిగా రూపు దిద్దుకుంటున్న సమయంలో ముందుకొచ్చిన రైతాంగ పోరాటాలు ఆయన కలానికీ, కుంచెకూ (లెన్సుకు కూడా) కొత్త దృష్టినీ, పదునునూ, నిత్యనూతన చైతన్యాన్నీ అందించినయి. ప్రభాకర్ జీవితాన్ని అర్థం చేసుకోడం ప్రారంభించి, సమాజాన్ని

శాస్త్రీయంగా విశ్లేషించి తన కవితల్లో పీడిత ప్రజల పోరాటాలనీ, ఆకాంక్షలనీ ప్రతిఫలించి 'ఎర్ర పావురాలు'గా ఎగరేసాడు. అలిసెట్టి formative days లో వచ్చిన కవితలయినా ఆయన అవగాహననీ, దృక్పథాన్నీ, ఆయన వికసించిన పరిణామ దశనూ ప్రతిఫలిస్తాయా కవితలు. ఫొటోగ్రఫీ పట్ల, చిత్రకళ పట్ల అలిసెట్టి కున్న అభిరుచి ఆయనను ఒక మంచి కళాకారుడిగా, పీడిత ప్రజల పట్ల ప్రేమ వున్న కళాకారుడిగా ఎదగటానికి వుపకరించాయి. జగిత్యాల నుండి కరీంనగర్‌కు తరలిన ప్రభాకర్ జీవితంలో మొదట ప్రవాసాన్ని ఎదుర్కొన్నాడు. నిజానికి కరీంనగర్ జగిత్యాలకు పెద్ద దూరం లేకపోవచ్చు. కానీ పొట్ట చేత పట్టుకుని ఫొటో స్టూడియో పెట్టుకోడానికి కరీంనగర్‌కు చేరిన ప్రభాకర్ జీవితం ఏమంత సాఫీగా నడవలేదు.

ప్రభాకర్‌కు ఉద్యమాలపట్ల వున్న ప్రేమా, గాఢమైన సానుభూతీ, మమేకతా ఆయనను విప్లవ రచయితల సంఘం సభ్యున్ని చేసినయి తనొక నిబద్ధ రచయితగా, పీడిత ప్రజల రాజకీయాల పట్ల కమిట్మెంటు వున్న రచయితగా ప్రకటించుకున్నాక ప్రభాకర్ మరింత శక్తివంతమయిన కవిత్వం రాసాడు. బహుశ ఆయన తన సాహిత్య జీవితంలో అత్యంత శక్తివంతమైన కవిత్వం, చిత్రలేఖనం, ఫొటోగ్రఫీ (ఈ మూడూ ఆయన సాహిత్య జీవితంలో అవిభాజ్యంగా వున్నాయి) భావజాలం లోనూ, దృక్పథంలోనూ నిర్దిష్టంగానూ, శాస్త్రీయంగానూ వున్నప్పుడు క్రియాశీల సాహిత్య కార్యక్రమాల్లో విరసం సభ్యుడుగా పాల్గొన్నప్పుడు సృష్టించేడు. అయితే ప్రభాకర్ అట్లా ఎక్కువ కాలం కొనసాగలేకపోయాడు. కరీంనగర్‌లో ఫోటో స్టూడియో ఆయనకూ జీవిక నివ్వలేకపోయింది ఆయన కళాతృష్ణకు కొత్త వెలుగు లివ్వలేకపోయింది. ఇక్కడ ఆయనలో బీజప్రాయంగా వున్న అరాచకత్వం కొంత పాత్ర నిర్వహించిందనే చెప్పుకోవాలి. సిర్సిల్లా, జగిత్యాల పోరాటాలపై తీవ్రమైన రాజ్యహింస, కల్లోల ప్రాంత పర్యటన, పోరాటాలని బహిరంగంగా సమర్థించే ప్రజాస్వామిక హక్కులను ప్రభుత్వం కాలరాచివేసిన పరిస్థితి ప్రభాకర్ జీవితాన్నీ అల్లకల్లోలం చేసినాయి. ఒకవైపు అస్తవ్యస్తమైన ఆర్థిక పరిస్థితి, మరొకవైపు పెరిగిన నిర్బంధమూ ప్రభాకర్ జీవిత నౌకను నగర సముద్రంలోకి నెట్టివేసినయి.

ఆకలితో, ఆవేశంతో హైద్రాబాదులో అడుగుపెట్టిన ప్రభాకర్‌ను నగరం పామై కాటేసింది. విద్యానగర్‌లో, చిక్కడపల్లిలో ఫొటో స్టూడియోలు పెద్దగా జీవితానికి ఆసరాను ఇవ్వలేదు. బీజ రూపంలో వున్న అరాచకత్వానికి నగరంలో దొరికిన ఆసరా ప్రభాకర్‌ను విరసానికి దూరం చేసినయి. నిబద్ధ రాజకీయాలు, జీవితం పట్లా, సమాజం పట్లా నిర్దిష్టమైన దృక్పథంనుండి ప్రభాకర్ కొంచెం ఎడ మైనా నిజాయితీని కోల్పోలేదు. సమాజాన్ని విశ్లేషించడం మానలేదు. జీవికకోసమే

'సిటీ లైఫ్' రాసినా నగర జీవితంలోని పలు కోణాలని ఆయన దర్శించిన పద్ధతీ, చురకవేసిన తీరూ నగర పాఠకుల హృదయాలపై చెరగని ముద్ర వేసినయి. అయితే ప్రభాకర్ మినీ కవిత్వం అనే రూపంలో ప్రయోగం చేసినా ఆ ప్రయోగం తాను చెప్పదల్చుకున్న విషయాన్ని ఎంత శక్తివంతంగా చెప్పాలనే తపనతో చేసిందే కానీ నిరర్థకంగా చేసింది కాదు. రక్తరేఖ, సంక్షోభగీతం ప్రభాకర్ కవిగా ఎత్తుకు ఎదిగినంతర్వాత ఆయన మానసిక, రాజకీయ పరిపక్వతను సూచించే కావ్యాలు. మినికవితనే కాదు దీర్ఘ కవితనూ శక్తివంతంగా రాయగలను అని నిరూపించు కున్నాడు ప్రభాకర్. అలిసెట్టి చిత్రకళలోనూ గొప్ప ప్రతిభను వ్యక్తీకరించాడు. తాను రాసిన మినీ కవితల భావాన్ని వ్యక్తీకరిస్తూ గీసిన చిత్రాలు పలువురిని ప్రభావితం చేసినయి. ముఖ్యంగా వేశ్య మీద, మార్కెట్ సంస్కృతి మీద, డబ్బు ప్లే చేసే దుర్మార్గం మీదా, దుష్ట రాజకీయ వ్యవస్థమీదా, దోపిడీ మీదా ప్రభాకర్ తన పదునైన మాటలకు తోడుగా నిప్పు కణికల్లాంటి చిత్రాలని మండించిన ప్రభాకర్ తన రక్తంతో ఈ వ్యవస్థకు మరణశాసనం రాసాడు. తన ఆరోగ్యాన్నీ, జీవితాన్నీ సంసారాన్నీ నిర్లక్ష్యం చేసుకుని కళ కోసం కవిత్వం కోసం ప్రతి నెత్తుటి బొట్టునూ వెచ్చించాడు. అర్ధరాత్రులు అనేకసార్లు నెత్తురు కక్కుతూ కూడా తన కుంచెతో రక్తవర్ణ చిత్రాలు గీస్తూ మండుతున్న అగ్నిగోళాల కళ్ళతో ప్రపంచాన్ని దర్శిస్తూ కవితల సైనమెట్లతో దోపిడీ పర్వతంపై దాడి చేసిన సాహితీయోధుడు ప్రభాకర్.

ఎన్నోసార్లు చెప్పి చూసాం — నీ ఆరోగ్యాన్ని కొంచెమైనా లెక్కచేసి జాగ్రత్త పడమని? అయినా విన్నాడా? నారాయణగూడలో రెండంతస్తుల పైన తన చిన్న అద్దెఇల్లు దాకా ఎక్కడానికే ఊపిరి చాలక ఉక్కిరిబిక్కిరై, ఊపిరితిత్తులు చిల్లేలా దగ్గి దగ్గి ఆయాసంలోనే సిటీలైఫ్ ప్రింటింగ్ తాలూకు ప్రోషైద్‌లను చూపి 'ఎంతమాత్రమూ సాగడంలేదని కలవరపడ్డ అలిసెట్టి యాదికొస్తే గుండె నిండా విషాదమూ, క్రోధమూ, కసీ తాటెత్తు అలలై ఎగసిపడుతున్నాయి. ఒక కవి ఎంతగా తపన పడాలో, ఎంత క్షోభ పడాలో, కవిత్వం పట్లా, సమాజం పట్లా ఎంతగా స్పందించాలో, ఎంత తనను తాను దహించుకుని కవిత్వాన్ని సృష్టించాలో, తన శరీరాగ్నిలో పునీతుడు కావాలో సాటి కవులకూ, సమస్త సాహిత్య లోకానికీ గొంతెత్తి చాటిన ప్రభాకర్, నెత్తురు కక్కుకుని గళమెత్తిన ప్రభాకర్—యిక లేడు. చిక్కడపల్లిలో, నారాయణగూడలో అస్థిపంజరం లాంటి ఆకారమొకటి శరీర మొత్తాన్ని నేత్రాలుగా, జీవితాన్ని మొత్తం ఇంధనంగా దోపిడీ వ్యవస్థకు సింహ స్వప్నమైన సాహిత్యాన్ని సృష్టించడానికి నిర్విరామంగా, ఒక్క గడియ తీరిక లేకుండా తిరుగుతూ, చలిస్తూ కనబడదు. అయితేనేం హైదరాబాద్ ఏ ఒక్క ఉదయమైనా ప్రభాకర్‌ను తలుచుకోకుండా నిద్ర లేవగలదా? అమాయకపు పల్లెల నుండి పట్నానికొచ్చి పరిశ్రమల్లో చిక్కుకుపోయి ఫ్యాక్టరీ పొగ గొట్టాల్లో మసిబారి→

## సామ్రాజ్యవాద భూతా(త)ల స్వర్గం : (4)
## అమెరికాలో నల్లజాతి వారి పట్ల వివక్షణ

—డా॥ కిరణ్మయి

అబ్రహాం లింకన్ ఆధ్వర్యంలో అమెరికాలోని నీగ్రోలకు స్వతంత్రం ప్రసాదించబడిందని, స్వేచ్ఛ లభించిందని, బానిసత్వం రద్దు చేయబడిందనీ పాఠ్య పుస్తకాలలో చదివి సంతోషిస్తుంటాం. కాని వాస్తవమేమిటంటే అక్కడి ఆఫ్రికన్లు వారిని ఆఫ్రో అమెరికన్లని పిలవచ్చు— జాతి వివక్షణ విధానానికి గురౌతున్నారు.

టామ్ విచర్ అనే సామాజిక శాస్త్రవేత్త తన పుస్తకం "టు నేషన్స్" (రెండు రాజ్యాలు) అనే గ్రంథంలో తెల్ల, నల్ల జాతివారి మధ్య అంతరాలు గతంలో అంతరాలు గతంలో కంటే బాగా ఎక్కువైపోయాయి.

కాంగ్రెస్ సభ్యుడు రిచర్డ్ గెఫార్ట్ రిపబ్లికన్ పార్టీని ఇలా తప్పుపట్టాడు." "12 ఏళ్ళుగా కొనసాగిన నిర్లక్ష్యం వల్ల, కోపం, నిరాశ అలముకుంటాయి. ప్రజలు ఉడికిపోతున్నారు. 12 ఏళ్ళ పీరియడ్‌లో ఆర్థికంగా అధ్వాన్న స్థితికి చేరాం. 12 ఏళ్ళపాటు జాతిని మరిచిపోయారేమో అన్న అనుమానం వుంది. 12 ఏళ్ళ జాతి వివక్షణ ఆఫ్రికన్ల స్థాయిని అధోగతికి దించింది."

24.3 శాతం నల్లజాతి గృహాలవారు దారిద్ర్య రేఖ దిగువన వున్నారు. 49.8 శాతం నల్లజాతి కుటుంబాలలో ఒక్కడైనా నిరుద్యోగిగా వున్నాడు. సంపదలో ఓలలాడుతున్న అమెరికా తెల్లజాతి వారి ప్రత్యేక సౌకర్యాలు మైనారిటీ నల్లజాతి వారికి లేవు.

అమెరికా ప్రభుత్వం తాను 2.5 ట్రిలియన్ల డాలర్లు పేదరికం నిర్మూలనకు ఖర్చుపెడ్తున్నానని గొప్పలు చెప్పుకుంటున్నా - దీన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ

---

→పోయిన ప్రభాకరుడు ఎగజిమ్మే వెలుతురు నెత్తురై చిందకుండా నగరంలో తెల్లారుతుందా ?

ప్రభాకర్ జీవితం మనకి రెండు విషయాలు స్పష్టం చేస్తోంది—ఈ వ్యవస్థ మీద కసితో ఆయన పదునెక్కించిన నెత్తుటి కవిత్వపు దీక్ష మనకు నిరంతరం స్ఫూర్తినిస్తుంది. సమాజంపై పోరాటాన్ని ఎక్కుపెట్టిన కవియోధుడు తన ఆరోగ్యం పట్ల, జీవితం పట్ల క్రమశిక్షణతో మెలగాల్సిన ఆవశ్యకతనూ మన స్పృహలోకి తెస్తుంది. తాను జీవించిన కొద్ది కాలంలోనే, స్పెయిన్ అంతర్యుద్ధంలో అర్ధాంతరంగా మరణించిన క్రిస్టోఫర్ కాడ్వెల్ దీక్షనూ, మృత్యువు ముంచుకొస్తుందని తెలిసినా మొక్కవోని జూలియస్ ఫ్యూచిక్ దృఢత్వాన్నీ, మృత్యుశయ్య మీదా పట్టువీడని చెర మొండితనాన్నీ గుర్తుతెచ్చే ప్రభాకర్ చిరస్మరణీయుడు. ★

ప్రభుత్వ సహాయం అంతా నల్లజాతి వారు ఎక్కువగా వున్న, పేదరికంతో మగ్గిపో తున్న లోతట్టు నగరాలకు పెడుతున్న ఖర్చు క్రమంగా తగ్గిపోయింది. రీగన్-బుష్‌ల పుష్కరంపాటు పరిపాలనలో ఈ లోతట్టు నగరాలకు చేసే ఆర్థిక సహాయం 63 శాతం వరకు పడిపోయింది.

12 ఏళ్ళ రిపబ్లికన్ పార్టీ పాలనలో జాతి విద్వేషాలు చెలరేగకుండా తీసుకున్న చర్యలేమీ లేవు. కూక్లక్స్ క్లాన్ అనే ముఠాను పునరుద్ధరించడంతో పాఠశాలల్లో, కళాశాలల్లో ద్వేషం, పగ, పెరుగుతున్నాయి. ప్రతి వేయిమంది నల్లజాతి మగవారిలోనూ ఒకడు ప్రతి సంవత్సరం హత్యకు గురౌతున్నాడు 20 సంవత్సరాల వయసులో వున్న ప్రతి నలుగురు నల్లజాతి యువకుల్లో ఒకడు జైలులో వున్నాడు. ఇదే పరిస్థితి కొనసాగితే 2000 సంవత్సరం నాటికి జైలులో వున్న నేరస్తుల్లో 50 శాతం మంది నల్లజాతివారే అవుతారు.

జాతి సమానత భావం వచ్చినప్పటి నుంచీ అల్లర్లు ఒక క్రమంలో జరుగుతూ వున్నాయి. 1967లో డెట్రాయిట్ అల్లర్లలో 43 మంది చనిపోగా, 2000 మంది గాయపడ్డారు. 7000 మందిని జైలులో పెట్టారు. 1967లో న్యూయార్క్ అల్లర్లలో 26 మంది మరణించగా, 1500మంది గాయపడ్డారు. 19_0లో మియామి, న్యూయార్క్ పట్టణాలలో ప్రజ్వరిల్లిన జాతి హింస, సాన్ ఫ్రాన్సిస్కో, సియాటిల్, ఒమాహా, మాడిసన్, పిట్స్‌బర్గ్, న్యూయార్క్, బాల్టిమోర్, అట్లాంటా, టాంపా, బర్మింగ్‌హామ్, వారెన్స్‌బర్గ్, లాస్‌వేగాస్ మొదలైన పట్టణాలకు వ్యాపించాయి. సాన్‌ఫ్రాన్సిస్కోలో అత్యవసర పరిస్థితి ప్రకటించారు. ప్రతిష్టాకరమైన జయంట్స్-ఫిల్లీస్ బేస్ బాల్ పోటీ వాయిదా పడింది. వాషింగ్టన్‌లో 14 వేల మంది ఉద్యోగులు పని ఆపేశారు. న్యాయశాఖ ముందు, వాషింగ్టన్ జ్ఞాపక చిహ్నం ముందు, వైట్ హౌస్ ముందు వేలాది మంది నిరసన ప్రదర్శనలు చేశారు

టామ్ వుల్ఫ్ (Tom wolfe) అనే నవలా రచయిత రాసిన "అహంకారాలకు భోగి మంట" (Bonfire of the Varities) నవలలో 1980 లలో రీగన్ ప్రభుత్వ హయాంలో అమెరికాలో వున్న భయానక పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. "అడ్డూ అపూ లేని దురాశ, పేరాస, త్వర త్వరగా కుబేరులమై పోదామన్న అత్యాశ - కుళ్ళిపోయిన వ్యవస్థ, కుళ్ళిన సమాజం - దానిని మరింత దిగజార్చడం. మొదలైన విషయాలు ఆ నవలలో చర్చించారు.

అమెరికాలో నల్లజాతివారి పేదరికం మనదేశంలో పేదవారి పేదరికంలా వుండదు. కలకత్తాలో, బొంబాయిలో పేవ్‌మెంటుపై బతుకుతున్న అత్యంత హీనమైన, దయనీయమైన పేదవారు అమెరికాలో కనపడక పోవచ్చు. ఎందుకంటే

(తరువాయి 55వ పేజీ)

# మతం మత్తు వదలరో

రామ జన్మభూమిరా
ఇది రగులుతున్న మంటరా
గద్దె నెక్కి కులికే తందుకు
రాజకీయ తంతురా
ఇది పేదల చీల్చి అణగద్రొక్కే అగ్రకులాల కుట్రరా ||రా||
ఊడలు వేసిన మతవాదం
పెరిగి పెరిగి ఉన్మాదమాయెను
చరిత్రలోన జరగనివన్ని
విశ్వాసాలకు అంటగట్టిరి
మతజ్వాలలు రేపిరేపి మనిషిరక్తమే త్రాగుతున్నరు ||రా||
రాముడు పుట్టిన భూమిపైన
మసీదులే కట్టారంట
మసీదులూ కూలగొట్టి
మందిరాలూ కట్టాలంట
హిందూ రాజులు కూలగొట్టిన బౌద్ధగుడుల మాటేమిటన్న ||రా||
అయోధ్యా మంటల్లోనా
మాడిపోయిరి వందలమంది
దేశంలోన ఎక్కడ జూసిన
శవాల గుట్టలు పేరుకన్నవి
ఇది స్మశానాలపై గుడులను కట్టే కాషాయుల సంస్కృతిరా ||రా||
కమలం చాటున కత్తులు దాచి
బడుగు జీవుల కంఠాలు నరికిరి
పారే రక్తం మడుగుల ఈది
బాబ్రి మసీదును కూలగొట్టిరి
పెళ్ళపెళ్ళకు దేశమంతటా పేద గుండెలు అవిసిపోయెరా ||రా||
పాత్రికేయుల గొంతులపైన
కరసేవకులు కత్తులు మోపిరి
సాక్షం చెప్పే కన్నులలోని
రెటీనాలను చితకపొడిచిరి
సూర్యచంద్రుల సాక్షిగా నిజం కడుపులో కత్తులు దింపిరి ||రా||

(తరువాయి 11వ పేజీ)

# అయోధ్య ఘటనలు - లౌకిక శక్తుల కర్తవ్యం

— ప్రొ॥ వి. రామకృష్ణ

డిసెంబర్ 6 (1992) న అయోధ్యలో జరిగిన ఘటనలు, ఆ తర్వాత దేశంలో, 1947 తర్వాత, ఎన్నడూ జరగనంత మారణహోమం, దేశపు యింద్రియాల్ని మొద్దు బార్చింది. తీవ్రమైన షాక్ వల్ల స్పర్శజ్ఞానాన్ని కోల్పోయినట్లుగా జాతి నిశ్చేష్టమైంది. ఇప్పుడల్లా షాక్ నుండి తేరుకొనే పరిస్థితి కన్పించడం లేదు.

రాజ్యాంగాన్ని, చట్టపరమైన పరిపాలనా సూత్రాలను, అత్యున్నత న్యాయస్థానపు ఆదేశాలను—మొత్తం ప్రజాస్వామిక మౌలిక సూత్రాలను బాహాటంగా తోసిపుచ్చి, భారతదేశపు లౌకిక పునాదులనే, నాలుగొందల యాభై సంవత్సరాల చారిత్రక కట్టడంతో పాటు మతోన్మాదుల, కరసేవకుల పేరుతో ధ్వంసం చేశారు.

ఇది పూర్తిగా ఊహించని, అనుకోని చర్య కాదు. సమంగా ఆలోచించే వారికి యీ మతోన్మాద దుశ్చర్యను నివారించడం సాధ్యం కాదన్న విషయం కొద్దికాలంగా అర్థమవుతూనే వుంది. ఎటొచ్చీ, ఈ చర్యవల్ల పూర్తి దిగ్భ్రాంతీ, ఆశ్చర్యమూ భారత ప్రభుత్వానికి, ప్రధానమంత్రికి మాత్రం కలిగింది. దీనిక్కారణం సంఘ పరివార' శక్తులను, వారి అంతర్యాన్ని, ఉద్దేశాలను ప్రభుత్వమూ, ప్రధాన మంత్రి తప్పు అంచనా వేయడమే! కొద్ది సంవత్సరాలుగా మతాన్ని, దాని వున్నత, పవిత్ర భావజాలాన్ని రాముడితో, రామ జన్మస్థానంతో ముడిబెట్టి, విశ్వాసాన్ని చట్టానికి అతీతం చేసి, మత విశ్వాసం ముందు, మరే చట్టబద్ధమైన, ఆధునిక నాగరికతా విలువలు అప్రధానమని చెవినిల్లు కట్టుకొని, రాత్రింబవళ్ళు ప్రచారం చేసి, ప్రజల్ని తప్పుదారి పట్టించడం మనం చూస్తున్నాం. శిలాన్యాస్‌లు. రథ యాత్రలు, కర్ సేవ, ఆలయ నిర్మాణం —యివన్నీ అతి నేర్పుతో చేపట్టిన కార్యక్రమాలే ! వాటి పరాకాష్ఠే మసీదు విధ్వంసం.

దేశానికి, దేశప్రజల ప్రయోజనాలకు తీవ్ర విఘాతమే కలిగింది. ప్రభుత్వంపై నమ్మకం సన్నగిల్లింది. దేశం మొత్తం, అత్యున్నత న్యాయస్థానమూ, దేశ సమైక్యతా మండలీ, అత్యధిక ప్రజానీకమూ నిర్ద్వంద్వంగా, బాబ్రీ మసీదును - చారిత్రక కట్టడాన్ని, లౌకిక వాదానికి ప్రతీక—ఎట్టి పరిస్థితులలోనయినా కాపాడమని ప్రధాన మంత్రికి పూర్తి అధికారాన్నిచ్చి, ఆయనపై సంపూర్ణ విశ్వాసాన్నుంచారు. అయినా బి.జె.పి., ఘటనలను ముందు ప్రకటించినట్లుగా 'కాగల కార్యాన్ని గంధర్వులే' తీర్చారు.

(9వ పేజి తరువాయి)

సిగ్గులేని పరిపాలకులు
బాబాలకాళ్లు పట్టుతున్నరు
సెక్యులరిస్టుల ఫోజులుకొట్టి
మత పరిపాలన చేయుచున్నరు
మతాల పేర కులాల పేర ఓట్ల కొరకు దిగజారుతున్నరు ॥రా॥
బాబ్రి మసీదు కూలినంక
గగ్గోలు పెట్టిందానాడు
చట్టబద్ధం చేయుట కొరకే
గుడిని తెరిచిందీనాడు
ఈ రెండు నాల్కల సర్కారుకు సావుపాట పాడరన్నా ॥రా॥
రెక్కలాడితె డొక్కలాడని
పేదప్రజలకే మతం లేదురా
కష్టజీవుల సెమట సుక్కలో
మతం వాసన ఎక్కడుందిర
సెమట చుక్కల దోచుటకొరకే మతాలన్ని పుట్టినాయిరా ॥రా॥
మతాలన్ని మానవులకు
మత్తుమందని తెలుసుకోండిరా
మత్తు దులిపి మతవాదుల తలను
సాయుధమై సాగి రండిర
మతాలుండని కులాలుండని రాజ్యం కొరకు పోరరండిరా ॥రా॥

శ్రీనివాసన్

ఇలా ఎందుకు జరిగింది? దీని పర్యవసానం ఏమిటి? ఫాసిస్ట్ శక్తులయిన మతోన్మాదుల నుండి మన ప్రజలను, మన వుమ్మడి సంస్కృతీ వారసత్వాన్ని, ప్రజాస్వామిక విలువలను ఎలా కాపాడుకోవాలి? ప్రజల బాగోగులను, భవిష్యత్ ఆశలను మతోన్మాదం నుండి తప్పించి, ఆర్థిక, సాంఘిక సమత్వం వైపు ప్రజల దృష్టిని ఎలా మళ్ళించాలి ?

ఇవీ నేడు మన ముందున్న సమస్యలు.

జాతీయోద్యమ కాలంలోనే వేరే పాయగా ఆరంభమైన రెండు విధాల మత తత్వం—హిందూ, ముస్లిం (మెజారిటీ, మైనారిటీ మతతత్వం) దేశ విభజనతో ఒక ముగింపు కొచ్చింది. (కానీ, నేటి మతతత్వం అయోధ్య విధ్వంసంతో ముగియక పోగా యిది ఆరంభమనే అనుకోవాలి.) అప్పట్లో రెండు ప్రధాన మత సంస్థలు—

ముస్లింలీగు, హిందూ మహాసభ—మత తత్వాన్ని పెంచి పోషించాయి. ద్విజాతి సిద్ధాంతంపై నమ్మకముంచి, వేరే స్వతంత్ర దేశం—పాకిస్తాన్—కోసమయినా ముస్లింలీగ్ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, వలస వాదాన్ని ప్రతిఘటిస్తే, హిందూ మహాసభ జాతీయోద్యమంలో క్రియాశీలకంగా పాల్గొననే లేదు. పైగా హిందూ మత తత్వాన్ని రెచ్చగొడుతూ, ఇతర మతాల ప్రజలపట్ల ద్వేషాన్ని పెంచడం ద్వారా తన పునాదిని ప్రజల్లో పెంచుకోడానికి కృషి చేస్తూ వచ్చింది.

అందువల్ల స్వాతంత్ర్యం వచ్చాక, మెజారిటీ మతతత్వ వాదులు దేశ విభజనను ప్రచారాంశంగా చేసి, విభజన కనుకూలురయిన వారందరినీ దేశద్రోహులుగా, హిందూ మతేతరులుగా చిత్రించారు. మైనారిటీలలో ముఖ్యులయిన ముస్లింలను (పాకిస్థాన్‌కు పోకుండా ఇక్కడ స్థిరపడిపోయిన జాతీయ ముస్లింలనందర్నీ) విదేశీయులుగా వర్ణించి, దేశ విభజనకు కారకులుగా ప్రచారం చేశారు. ముస్లింలీగ్ రాజకీయాలు ఏ కొద్దిమంది శిష్టులకో పరిమితమయ్యాయనీ, వాళ్ళు తమ రాజకీయ ప్రయోజనాల కోసం సామాన్య ప్రజానీకాన్ని వాడుకొన్నారన్న చారిత్రకాంశం వీరికి ఒకవేళ తెలిసినా, దాన్ని పనిగట్టుకొని తొక్కిపెట్టి, ముస్లిం వ్యతిరేక వున్మాదాన్ని దేశంలో రెచ్చగొడుతూ వచ్చారు. స్వాతంత్ర్యానంతరమే, 1948 లో మహాత్మాగాంధీ హత్య, యీ విష ప్రచార ఫలితమేనన్న విషయం గుర్తుంచుకోవాలి.

1947 తర్వాత భారతదేశం మతాతీత, లౌకిక రాజ్యంగా అవతరించింది. ఇది ఆధునిక కాలంలో, ఏ నాగరక దేశమైనా చేయాల్సిన అంశం. మత రాజ్యాలు మధ్య యుగాలలో అంతరించిపోయాయి నిజానికి. పాకిస్థాన్ లాంటి దేశాలు మినహాయింపుగా మతరాజ్యాలైతే, వాటికి కారణం, అవి ఆవిర్భవించిన రాజకీయ, సామాజిక నేపథ్యపు పునాదులే. పైగా, ఆధునిక భావచింతనకు దూరమై, ప్రజాస్వామ్య, లౌకిక రాజకీయాలను కాలదన్ని మతతత్వం, ద్విజాతి సిద్ధాంతాల ప్రాతిపదికగా పుట్టిన దేశాలకు వేరే గత్యంతరం లేదు. అయితే, భారతదేశపు లౌకిక పునాదులు బలమైనవి కావు. లౌకిక రాజ్యమని ప్రకటించినంత మాత్రాన, దానంతటదే లౌకిక పునాదుల్ని పటిష్టం చేసుకోలేదు. సమాజంలోని అన్ని వర్గాల, మతాల, ప్రాంతాల రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలను కాపాడాలి. వారి వారి సాంఘిక, సాంస్కృతిక వారసత్వాన్ని నిశ్చయంతో, విశ్వాసంతో నిలపగలగాలి. ఆధునికతకు, లౌకికతకూ కావల్సిన విద్యా, వైజ్ఞానిక దినుసులను విద్య ద్వారా, విజ్ఞానం ద్వారా ప్రజలకు అందించాలి. విద్యా విధానాన్ని తదనుగుణంగా మలచి, హేతుబద్ధమైన శాస్త్రీయ స్పృహను, జిజ్ఞాసను ప్రజల్లో వ్యాపింపచెయ్యాలి. ఇదొక బృహత్ కార్యక్రమం. భావ విప్లవ మనదగినంతగా, నూతన సమాజపు భావాలను ప్రజల కందివ్వాలి. మతం వ్యక్తిగతాంశమనీ, దానికి రాజకీయ, సామాజిక వ్యవహారాల్లో చోటు లేదనీ ప్రజలు గ్రహించాలి.

పై విధంగా భారతీయ సమాజం పరిణామం చెందలేదు. లౌకికత్వం నినాదంగా మిగిలిపోయింది. అత్యధిక సంఖ్యలో సామాన్య ప్రజలు, అనేకమంది మేధావులు, వామపక్ష రాజకీయ పార్టీలు, కొన్ని ఇతర రాజకీయ పక్షాలు, లౌకికత్వానికి బలమైన వత్తాసుగా (నేటికీ) వున్నా, లౌకికత్వం, మతతత్వ ధాటికి తట్టుకోలేక పోయింది. దీనికి రెండు కారణాలు—ఒకటి–పాలకవర్గాలు, ముఖ్యంగా 1947నుండీ, ప్రధాన అధికార పక్షమైన కాంగ్రెస్ లౌకిక తత్వాన్ని నీరుగార్చింది. స్వప్రయోజనాలకు వాడుకొంది. స్వతస్సిద్ధంగా మనిషిలో దాగివున్న మత భావజాలానికి పగ్గం వేయకుండా కళ్ళెం వదిలింది. ప్రభుత్వం చేపట్టే అన్ని కార్యక్రమాల్లో మతపరమైన పూజలు, పునస్కారాలు, పబ్లిక్ జీవితంలో రాష్ట్రపతి నుండి కింద మామూలు మంత్రి వరకూ గుళ్ళనూ, గోపురాలనూ దర్శించడం, పొర్లు దండాలు పెట్టడం లాంటివి జరిగిపోతూనే వున్నాయి. ఇదంతా వారి వ్యక్తిగత జీవితం అనుకొందామా? లేదే! అన్ని ప్రభుత్వ మర్యాదలతోనూ, వసతులూ, సౌకర్యాలతోనూ, రేడియో, టి.వీ, ప్రచార సాధనాలతో సహా యివి సజావుగా సాగిపోతున్నాయి కదా!

రెండవ కారణం—ఈ పరిస్థితి నాధారం చేసుకొని, అటు మెజారిటీ, ఇటు మైనారిటీ మతతత్వవాదులు మొత్తం లౌకికత్వాన్నే దుయ్యబడుతున్నారు. లౌకికవాదులను కుహనా (Pseudo) వాదులుగా చిత్రిస్తున్నారు (అయోధ్యలో రాముడి పేరుతో వేరొక మత చిహ్నాన్ని ధ్వంసం చేసి వీరెంతగా కుహనా హిందూ మతావలంబకులైనారో తెలిసిపోయింది.) మైనారిటీ అయిన ముస్లిముల పట్ల అనుచిత వుదార వైఖరి నవలంభిస్తున్నారని, వారిని బుజ్జగిస్తున్నారనీ, వారిని అన్నివిధాల సమర్థిస్తున్నారనీ ప్రచారం చేస్తున్నారు. నిజమే! రాజకీయ ప్రయోజనాల కోసం ఈ పని అన్ని రాజకీయ పక్షాలు చేస్తూనే వున్నాయి. దీనికి మినహాయింపు లేదు, బి.జె.పి.తో సహా! (ముస్లిములతో కాకుంటే మరొకరితో). ఈ పచ్చి అవకాశవాద రాజకీయానికి, పార్లమెంటరీ ఎన్నికల వూబిలో దిగబడిపోయిన ఏ రాజకీయ పక్షమూ మినహాయింపు కాదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో, భారతదేశంలో, రాజకీయాలు మతపరమైంది యిక్కడే. లౌకిక రాజకీయ పక్షాలు బలహీనంగా వున్నాయి. మత ప్రాతిపదిక గల ప్రతి రాజకీయ పక్షం—ముస్లింలీగ్, అకాలీదళ్, బి.జె.పి. ప్రజల్లో మత విశ్వాసాల సాయంతో ఇతర మతాలకు చెందిన వారిని తమ ప్రయోజనాలకు శత్రువులుగా చూపిస్తూ, పలుకుబడిని పెంచుకొన్నాయి. పంజాబ్‌లో అకాలీదళ్, కేరళలో ముస్లింలీగ్, దేశం మొత్తంమీద బి.జె.పి. (అంతకు ముందు హిందూ మహాసభ, జనసంఘ్) ఇదే వ్యూహంతో బలపడ్డాయి. 'హిందువులకు' జరిగే ప్రతి 'అన్యాయాన్ని' మంచికీ లేదా చెడుకూ—అన్నిటికీ ముస్లిముల కారణమన్న తప్పు సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. ముస్లిములు ఎన్ని పెళ్ళిళ్ళయినా చేసుకోవచ్చు. జనాభాను వాళ్ళు నియంత్రించుకోరు. తద్వారా, ఒకనాటికి వాళ్ళే మెజారిటీ

ప్రజలై పోతారు. వారు నడిపే విద్యా సంస్థలకి మైనారిటీ స్థాయినిచ్చినందువల్ల ఎన్నో ప్రయోజనాలు కలుగుతున్నాయి. ఇదీ ముఖ్యంగా బి.జె.పి. చేస్తున్న ప్రచారం. ఇందులో వాస్తవాలేమిటి ?

బహు భార్యత్వాన్ని పాటించినందువల్ల నష్టపోయేది ముస్లింలే కదా! పైగా జనాభా లెక్కల్లో వాళ్ళలో మగవాళ్ళకంటె స్త్రీలు మొత్తం మీద 25 లక్షలమంది తక్కువున్నారు. అలాంటప్పుడు ఇదెలా సాధ్యం? హిందువులలో చట్టసమ్మతం కాకున్నా, ఎంతమంది రెండో పెళ్ళిళ్ళు చేసుకోడం లేదు ? జనాభా నియంత్రణ హిందువులలో పేద, చదువులేని ఎందరు ప్రజలు పాటిస్తున్నారు ? వాళ్ళకు మరో బిడ్డ ఆర్థికంగా చేయూత నిస్తుంది కదా, శ్రమ శక్తికి తోడుపడుతూ—అదీగాక 1947 నుండి జనాభా లెక్కలను పరిశీలిస్తే, ప్రతి పది సంవత్సరాలకు గణించే జనాభా లెక్కల్లో ముస్లింలు 11 లేక 12 శాతం కంటె పెరగలేదు. పెరుగుదల ఎంత అధిగమించినా, 13 లేక 14 శాతాన్ని మించదని జనాభా నిపుణుల అంచనా. ఇక మైనారిటీ స్థాయి విద్యా సంస్థల్లో ముస్లింలు చేస్తున్న అక్రమాలు, ధనార్జన హిందువులచే నడపబడే సంస్థల్లో తక్కువా? అసలు రిజర్వేషన్లకు తిలోదకాలిచ్చి, డొనేషన్లు వసూలు చేసే విద్యా సంస్థలు, దేశంలో మతంతో నిమిత్తం లేకుండా ఒక భారీ వ్యాపారంగా మారినపుడు, ముస్లింలను మాత్రమే నిందించడం దేనికి?

వాస్తవాలిలా వుండగా, బి.జె.పి. చేస్తున్న యీ ప్రచారం (ఇప్పటికీ వాళ్ళ ప్రతి ఉపన్యాసంలో ఇదే చర్విత చరణంగా చెప్తున్నారు) అమాయక ప్రజలు, చదువుకొనీ, ఆలోచించడానికి ఇష్టపడని 'విద్యావంతులు' బలంగా నమ్ముతున్నారు. అసత్య ప్రచారం గోబెల్స్ నమూనాలో చేస్తూ, మతతత్వాన్ని ప్రోది చేస్తున్నారు.

దీని వెనకాల మరో అంశం మనం గమనించాలి.

గత దశాబ్దానికి పైబడి ప్రపంచంలో, ముఖ్యంగా మధ్య ప్రాచ్యంలో, ఇటు భారతదేశ వుపఖండంలో, యింకా కొన్ని యూరోపా దేశాల్లో మత మౌలికవాదులు (**Religious fundamentalists**) వృద్ధి చెందుతూ వస్తున్నారు. ఇరాన్‌లో ఖొమేనీ దీనికి ప్రబల తార్కాణం. ఆయా దేశాల్లో పాశ్చాత్యీకరణ (**westernisation**) కు వ్యతిరేకమన్నంతగా యిది ముందుకొచ్చింది. పాశ్చాత్యీకరణలో వున్న నాగరికాంశాలు, ఆధునిక జీవన విధానాన్ని యీసడించుకొని, మతం అనుమతించిన, మధ్యయుగాల జీవన విధానం వైపు దృష్టి మరలింది. జీవన విధానమేగాక. చట్టంలో, శిక్షలలో, ప్రభుత్వ పాలనలో, స్త్రీల సామాజిక జీవితం వరకూ యీ సనాతనవాదులు నిర్బంధాలు విధించి, పౌర జీవితంలోని ప్రజాస్వామ్యాన్ని, స్వేచ్ఛను పూర్తిగా హరించారు. పాశ్చాత్యీకరణకు వ్యతిరేకంగా నిర్మించబడ్డ యీ

ఉద్యమం వెనకాల పాశ్చాత్యదేశాల వ్యతిరేకత (anti-west) కూడ వుంది. అయితే ఇది సామ్రాజ్యవాద వ్యతిరేకత కాదని మనం గమనించాలి.

భారతదేశంలో మతమౌలిక వాదుల భావజాలపు పొరల్లో పాశ్చాత్య వ్యతిరేకత వుంది. ఇది పూర్తిగా 'హిందూత్వ' పునరుద్ధరణ వాదం నుండి పుట్టిందే! ఆర్యుల జన్మస్థలం భారతదేశం అని చారిత్రక వక్రీకరణలు చేయడానికి కారణం ఇదే. భారతదేశమే ప్రపంచ నాగరికతా, సంస్కృతులకు పుట్టినిల్లనీ, 'అన్నీ వేదాల్లోనే వున్నాయిష' అనే ఆర్య సమాజ, థియోసఫిస్టుల సిద్ధాంతం నుండి-వీరివరకూ ఇదే పిడివాదం చేస్తున్నారు. ఇటీవలి కాలంలో బి.జె.పి. చేపట్టిన కార్యక్రమాలన్నీ 'స్వదేశీ' మార్కుగా వర్ణిస్తున్నారు. స్వదేశీ ఆర్థిక విధానాలంటూ స్వావలంబన గూర్చి వక్కాణిస్తూ, పారిశ్రామికీకరణను, విదేశీ రుణ సహాయాలను ఆపివేయాలనీ పిలుపు నిచ్చారు. ఆధునిక యుగంలో యివేవీ సాగవని గ్రహించి వూరకుండి పోయారు. భారతదేశంలోని హిందూ మతతత్వవాదుల మౌలికత్వానికి పాశ్చాత్య వ్యతిరేకత కంటె, ముస్లిం మైనారిటీలపై బాణం ఎక్కుపెట్టడానికి అవకాశం లభించింది. వారి మౌలికతకు మొదటినుండీ బలమైన పునాది యిదే! చీటికీ మాటికీ మైనారిటీలను నిందించడం, హిందువులు పడే అన్ని రకాల బాధలకు, ఎదుర్కొనే సమస్యలకు మూలకారణం ముస్లింలేనని, ఒకవైపు మైనారిటీ వ్యతిరేక వున్మాదాన్ని రెచ్చగొడుతూ, మెజారిటీ యిజాన్నే ప్రజాస్వామ్యంగా, జాతీయతగా, దేశ విధానాలకు దిక్సూచిగా ముందుకు తెచ్చారు. అందుకనే ముందు చెప్పినట్లు, ముస్లింలపై వారు చేస్తున్న పసలేని విమర్శక అభియోగాలతో ప్రజలను నమ్మించ బూనడం సులభమని గ్రహించారు. మతతత్వ వాదులకు యివ్వాళ ప్రధానంగా చెప్పుకోదగ్గ స్వతంత్ర, అసలైన రాజకీయ, ఆర్థిక విధానాల్లేవు పరస్పర మత వ్యతిరేకతపై ఆధారపడిన కార్యక్రమం తప్ప. కాబట్టే వారు మత విశ్వాసాలను చట్ట, రాజ్యాంగ పరిధులకు అతీతమైనవిగా చెపుతూ, న్యాయస్థానాలను నవ్వులాటగా దిగజార్చారు.

వీరి ధోరణి కేవలం ప్రమాదకరమైందిగా మాత్రమే పరిగణించడం ప్రమాదాన్ని తక్కువ అంచనా వేయడమే! జాతీయోద్యమంలో భారతీయులు త్యాగాలనోర్చి, శ్రమించి సంపాదించుకొన్న జాతీయ వారసత్వాన్ని, ఆర్థిక, సామాజిక, భవిష్యత్ ప్రణాళికను వమ్ముచేసి, భారతీయం పేరుతో హిందూత్వాన్ని ప్రచారం చేస్తూ భారతీయత కానిదీ, హిందూత్వానికి విరుద్ధమైనదేదీ దేశానికి పనికిరాదంటున్నారు. మతంపై, దైవంపై, ఆస్తికతపై, ఆధ్యాత్మికతపై మక్కువతో, యదార్థ విశ్వాసంతో చేపట్టిందికాదు రామమందిర నిర్మాణం. దేశ ప్రజలను పట్టి పీడిస్తున్న అనేకానేక సమస్యలున్నాయి. ఆర్థికంగా దివాలాతీసి, అంతర్జాతీయ ద్రవ్యనిధికి తాకట్టుపెట్టారు దేశాన్ని. రాజకీయంగా, ఇన్నేళ్ళు పాలకవర్గాలు అవలంభిస్తున్న కుటిల విధానాల వల్ల, దేశం ముక్కచెక్కలయ్యేట్టు వుంది. ఆర్థిక, రాజకీయ సంక్షోభంతోపాటు

సామాజిక దుగ్మతలుతోడై, దేశంలో భిన్న వ్యవస్థలు పతనావస్థకు చేరుకొన్నాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం క్షీణించింది. న్యాయ, కార్య నిర్వాహక వ్యవస్థలు అవినీతికి ఆలవాలమై, తమ పాత్రను నిర్వర్తించలేకపోతున్నాయి. అవినీతి, లంచ గొండితనం సమాజపు మూల్యాలను పీల్చివేస్తున్నాయి. విద్యా రంగంలో అవ్యవస్థ తారా స్థాయికి చేరుకొంది. దేశం మొత్తం చుక్కానిలేని నావలా నడి సముద్రపు సంక్షోభంలో చిక్కుకొని వుంది. బాధ్యతాయుత రాజకీయ పక్షాలుగా, దేశంలోని వివిధ పార్టీలు పదవులకోసం, అధికారం కోసం నానా గడ్డి కరుస్తూ, సమాజంలోని విలువలను కాలరాస్తున్నాయి. ఈ తరుణంలో మతతత్వ శక్తులు, వీటిపరిష్కారానికి పూనుకోకుండా, ప్రస్తుతమున్న సంక్షోభాన్ని తమ స్వార్థ ప్రయోజనాలకోసం వాడు కోడాన్కి, మతాన్ని రాజకీయంతో జోడించి, దేశాన్ని మారణహోమానికి గురి చేస్తున్నాయి.

అన్నిరకాల మతతత్వశక్తులకు వ్యతిరేకంగా అందరూ కలసికట్టుగా పోరాడా ల్సిన సమయం ఆసన్నమైంది. అందరూ అంటే ఎవరు? వామపక్షాలు, గ్రూపులు, మేధావులు, లౌకికత్వానికి కట్టుపడ్డ ప్రతి ఒక్కరూ ఐక్యం కావాలి. ఈ ఐక్య సంఘటనలో కాంగ్రెస్ పార్టీకి స్థానం వుండరాదు. కాంగ్రెస్ పార్టీ స్వాతంత్ర్యానం తరం అవలంభించిన విధానాలను పరిశీలించినపుడు, లౌకిక పార్టీగా విశ్వసనీయతను కోల్పోయింది. ముఖ్యంగా మొన్నటి అయోధ్య ఘటనలు జరిగాక యిది మరింత ప్రస్ఫుటమైంది. బాబ్రీ మసీదు విధ్వంసాన్ని చేసింది కరసేవకులు కాగా, అన్ని అధికారాలు కలిగి వుండి, అన్నిపక్షాల వత్తాసు వుండి కూడ దాన్ని నివారించలేక పోయింది కేంద్రంలో అధికారంలో వున్న కాంగ్రెస్ పార్టీ. ఉమ్మడి సివిల్ కోడ్ కోసం క్రమంగా కృషి చేయకుండా, షాబానో కేసు విషయంలో మైనారిటీల రక్షణ పేరుతో, ఓట్లకోసం, సుప్రీం కోర్టు తీర్పును తోసిపుచ్చింది. హిందూ మతతత్వ వాదులను బుజ్జగించి అధికారాన్ని చేపట్టాలని, వివాదపూరితమైన శిలాన్యాస్‌కుఅనుమ తించింది. అయోధ్య సమస్య విషయంలో నిష్కర్షగా వ్యవహరించలేక పోయింది. మసీదు విధ్వంసం తర్వాత జరిగిన ఘటనలు - రామమందిర దర్శనానికి అనుమతివ్వడం, వివాదాన్ని సుప్రీం కోర్టు అభిప్రాయానికి సమర్పించడం, కాంగ్రెస్ పూగిసలాటకు, ద్వంద విధానాలకు అద్దంపడుతున్నాయి. కాంగ్రెస్ నిజంగా లౌకికత్వానికి కట్టుపడి వుందన్న నమ్మకం యీనాడు దేశంలో అధిక సంఖ్యాకులకు లేదు. దానికి కారణం ఆ పార్టీలో ప్రచ్ఛనంగావున్న మతతత్వశక్తులూ, బలహీనపు మత వ్యతిరేక విధానాలేనని మనం గ్రహించాలి. ఉమ్మడిగా మతతత్వాన్ని వ్యతిరే కించాలని చెప్తున్న కాంగ్రెస్‌కు ఆ కర్తవ్యాన్ని నిర్వహించగల సిద్ధాంతబలం, సంస్థా గత నిర్మాణం, కార్యకర్తలూ లేరు. కాబట్టి కాంగ్రెస్ పార్టీ మతవ్యతిరేకత కేవలం

కాగితాలకు, తీర్మానాలకు పరిమితమైపోయింది. ఇక, యితరులు నిర్మించే ఉద్యమ ఖజాలపై స్వారీచేసి, రాజకీయ లబ్ధిని పొందాలని ప్రయత్నం చేస్తున్నారు. కాంగ్రెస్ పార్టీలో కొందరు లౌకికవాదులు వుండచ్చు, కాదనలేం. అయితే వాళ్ళు పార్టీనికాదని బయటకు రావాలి. బాహాటంగా లౌకిక శక్తులతో చేతులు కలపాలి. ఇందులో ఎంతో 'రిస్క్' వుంది. కానీ యిది అవసరమైన తీసుకోదగిన రిస్క్. లేకుంటే అందులో వున్న లౌకిక శక్తులు కూడ రాజకీయ నాటకాన్ని ఆడుతున్నారని గ్రహించాలి. అలాగే యితర రాజకీయ పక్షాలు, వామపక్షాలతో సహా రాజకీయంగా యీ రిస్క్ తీసుకోక తప్పదు. దేశాన్ని మతం పేరుతో ముక్కచెక్కలు చేసి, భాతృ సదృశ అంతర్యుద్ధానికి తావీయకుండా నివారించాలంటే యిదొకటే మార్గం. దేశంలోని నిరుద్యోగులైన యువకులను, అవిద్య, అజ్ఞానంలో మగ్గుతున్న అమాయక ప్రజలను మత శక్తుల ధృతరాష్ట్రపు కౌగిలి నుండి తప్పించాలంటే, వారిని ఏ మతానికి చెందినవారైనా, ఆర్థిక, సామాజిక పోరాటాల మార్గంలో సమీకరించాలి. మతతత్వం ఒక సామాజిక, రాజకీయ మనస్థితి. కొన్ని ప్రత్యేక ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితుల నేపథ్యంలో యిది ప్రజలను మతపరంగా చీల్చి తప్పుడు అవగాహనకు (false consciousness) గురి చేస్తుంది. ఈ తప్పుడు అవగాహన-హిందువులకు, ముస్లిములకు, క్రైస్తవులకు, శిక్కులకు వేర్వేరు ఆర్థిక, రాజకీయ సమస్యలుంటాయని, వాటిని ఏ మతంవారు వారే పరిష్కరించుకోవాలన్న పొరబాటు చైతన్యాన్ని రూపుమాపాలి. పేదరికం, ఆర్థిక దోపిడి, పౌర హక్కులు, మతం- ఏదైనా, ప్రజలందరికీ ఒకటేనన్న భావం కలిగించాలి. అప్పుడే వేర్వేరు మతాల్లోని స్వార్థపర దోపిడీ శక్తుల ఆటకట్టించి, ప్రజల్ని వారికి వ్యతిరేకంగా ఏకం చేసి, ఆర్థిక సమత్వాన్ని, సామాజిక న్యాయాన్ని సాధించగలం. ●

---

## ప్రజలు ప్రతిహింసకు దిగాల్సిందే!

అమ్మా!

పర్యావరణ ప్రకృతిని సరుకుగా
సామ్రాజ్యవాదులు దోచి
'జీన్స్' బ్యాంకుల్లో దాస్తున్నారు
పర్యావరణ గురించి మాట్లాడమంటే
సామ్రాజ్యవాదుల గురించి
మాట్లాడడమమ్మా —
అవునమ్మా
మన చుట్టూఉన్న ప్రతి అంశం సామ్రాజ్యవాదులది

అమ్మా
మన భాషను, ఆహారధాన్యాన్ని
ధ్వంసం చేస్తూ ఆకలితో కరువు
కోరల్లో ముంచుతున్నారమ్మా
అమ్మా
అడివి మీద సామ్రాజ్యవాదుల పట్టు
ఆయుధం మీద సామ్రాజ్యవాదుల పట్టు
భూమి, నీరు, మేదస్సు, ఉత్పత్తి సరుకుల
మీద సామ్రాజ్యవాదుల పట్టు
అమ్మా
శ్రమ జీవన సంస్కృతిపై, అలల కళలపై,
ప్రాజెక్టులపై, కట్టుబట్టలపై
సామ్రాజ్యవాదుల పట్టు
ప్రపంచాధిపత్యం
సామ్రాజ్యవాదుల సరిహద్దు
అమ్మా
ఇంకా మిగిలిందేముంది
పీల్చే 'గాలి'
మ్రోగే 'ధ్వనే'గా
గాలి "అణు విద్యుత్" కేంద్ర కాలుష్యమైతే
ధ్వని "ఫైరింగ్ రేంజ్" చప్పుడు
అమ్మా
ఇప్పుడు చెప్పమ్మా
సామ్రాజ్యవాదులు చేసేది
'హింసా' కాదా ?
అవును నిజం హింసే
ప్రజలు ప్రతి
హింసకు దిగాల్సిందే !
అమ్మా!!

(నల్గొండ జిల్లాలో నాగార్జునసాగర్ వద్ద రాచకొండ ఏరియాలో ప్రభుత్వం నిర్మించ తలపెట్టిన అణు విద్యుత్ కేంద్రం ఫీల్డ్ ఫైరింగ్ రేంజ్‌లను వ్యతిరేకిస్తూ)

— యం. నిరంజన్

# మట్టి మీద పుట్టిన మహా నవల




— గోపరాజు నారాయణరావు

"జీవితం గురించి రాయాలంటే — జీవితం కావాలి". తన నవలకు స్వయంగా వ్రాసుకున్న పీఠికలో గూగీ వా థియోంగో అన్న మాటలివి. జాతీయ వారసత్వానికి సంబంధించినదంతా పోగొట్టుకుని, తిరిగి తమదైన 'సంస్కృతికి వేళ్ళెక్కడున్నాయో అన్వేషించడానికి, ఒక వ్యవస్థ జరిపే ప్రయత్నంలో ప్రస్ఫుటమయ్యే ఆర్తికి, సంఘర్షణకి, సమరానికి అక్షరరూపం ఇవ్వాలంటే,— జీవితమే కావాలి. అంటే జీవితాన్ని చూడాలి. అలాంటి దృక్కోణం నుంచి జీవితాన్ని దర్శించిన రచయిత గూగీ వా థియోంగో. అయన నవలే 'మట్టి కాళ్ళ మహా రాక్షసి'. కొద్ది తేడాతో 'రూట్స్' రచయిత హేలీ-వలెనే గూగీ కూడా తన జాతి నిస్సహాయస్థితి, నిర్వీర్య స్థితులను గురించి తాను పడిన వేదన, క్షోభలనే తన-సాహిత్యానికి వస్తువులుగా స్వీకరించాడు.

గూగీ తూర్పు ఆఫ్రికాలోని కెన్యా దేశస్థుడు. అక్కడి నైరోబి విశ్వవిద్యాలయంలో ఆంగ్ల శాఖకు అధిపతి. కాని వలస పాలనలో సాంస్కృతిక రంగాన్ని భావదాస్యంతో కలుషితం చేయగల శక్తివంతమైన సాధనం ఆంగ్లమని గూగీ గుర్తించాడు. అందుకే ఆఫ్రికాలో ఆంగ్లశాఖల అవసరం లేదని, ఆఫ్రికా భాషలను ముందు గుర్తించాలని ఉద్యమించాడు. అందులో భాగంగానే ఆఫ్రికా మట్టిని ప్రేమిస్తూ, పెట్టుబడిని ద్వేషిస్తూ, తన మాతృభాష గికియులో సాహిత్యం సృష్టించాడు. ఆ చైతన్యం నుంచి పుట్టిందే 'మట్టికాళ్ళ మహారాక్షసి'. (గికియులో 'కైతానీ ముతర బాయినీ' పేరుతో వ్రాసిన ఈ నవల గూగీ తరువాత ఆంగ్లంలోకి 'ఎ డెవిల్ ఆన్ ది క్రాస్' పేరుతో అనువదించాడు.) 1978లో తాను కారాగార వాసం అనుభవిస్తున్నపుడు, రాజకీయ ఖైదీగా 'టాయ్‌లెట్ పేపర్' మీదే గూగీ ఈ నవల వ్రాశాడు. బ్రిటన్ వలసగా వున్న కెన్యా, జోమో కెన్యాట్టా నేతృత్వంలో జరిగిన పోరాటంలో 1963తో స్వాతంత్ర్యం పొందింది.

పాలకుల రంగు మారినా, పాలన రంగు, రుచి మారక పోవడంతో కిమాతి అనే వ్యక్తి నాయకత్వంలో మరో పోరాటం (మౌమౌ) ప్రారంభమైంది. దీనినే గూగీ బోల్షివిక్ విప్లవం కన్నా చైనా విప్లవం కన్నా ప్రాణప్రదమైనదిగా భావించి, వీరగాథగా స్మరించాడు. ఫలితంగా కమ్యూనిస్టు ముద్రతో కారాగారానికి, తరువాత

తలదాచుకోవడానికి విదేశాలకు వెళ్ళిపోయాడు. మౌమౌ పోరాట ధ్యేయమే ప్రస్తుత నవలకు భూమిక. ఇదీ సంక్షిప్తంగా గూగీ రాజకీయ, సాంస్కృతిక నేపథ్యం.

గూగీ తన జాతి ఏది కోల్పోకూడదో చెబుతాడు. ఎందుకు కోల్పోకూడదో ఆక్రోశిస్తాడు. ఏది కోల్పోయిందో వివరించి విలపిస్తాడు. కోల్పోయిన దాని మూల్యంకన చేస్తాడు. అక్కడితోనే ఆగిపోడు. పోగొట్టుకున్నది పొందేందుకు పోరాడాలంటాడు.

మానవ సమాజం వ్యవస్థీకృతమైన దగ్గరనుంచి ఇప్పటివరకు మానవాళి ఎదుర్కొంటున్న విపత్తు - సామ్రాజ్యవాదం. మానవ సమాజం సహజ నైజంతో ఆధునికమవుతూవచ్చింది. సామ్రాజ్య వాదం అవతారాలు మార్చుకుంటూ వెనకే వస్తోంది. తొలిదశలో మాదిరిగా ఇప్పుడు, నీతి తప్పిన సైన్యంలాగానో, పెను తుపాను లాగానో, ప్రత్యక్ష యుద్ధంగానో సామ్రాజ్యవాదం వచ్చి పడకపోవచ్చు. దాని విషపు గోళ్ళు శరీరంలో పూర్తిగా దిగబడినాక కూడా తెలియనంత నాజూకుగా రాగలుగుతున్నది. పెట్టుబడి సామ్రాజ్యవాదంగా ముదిరింది. ఇది ఆశ్చర్యకరమైన, అనూహ్య సంగతి కాకపోవచ్చు. కాని పెట్టుబడిదారీ విధానం మీద కత్తిగట్టిన సోషలిజం - సోషలిస్టు సామ్రాజ్య వాదంగా బలిసి, పెట్టుబడి సామ్రాజ్యవాదానికి పోటీగా ప్రవర్తించడం చరిత్రను నిర్ఘాంతపరిచే సంఘటన. సామ్రాజ్యవాదం గురించి దేశాధినేతలో, రాజకీయ ప్రముఖులో, మేధావి బిరుదాంకితులో ప్రస్తావించడం పరిపాటి. అయినప్పటికి, సామ్రాజ్యవాద లక్ష్యం సామాన్య మానవుడేనన్న సత్యం అందరికి తెలియాలి. ఇందుకు సంబంధించిన చైతన్యం కావాలి. కడదాకా పోరాడాలి. అయితే ఆ పోరాట పటిమను జాతీయ వారసత్వం నుంచి, సాంస్కృతిక మూలాల నుంచి మాత్రమే దట్టించుకోవాలంటాడు గూగీ. ఇదే ఈ నవలకి ఊపిరి.

కథానాయిక కథ, వాస్తవాలు చెప్పవలసిందిగా, ఆమె తల్లి ఒక జానపద వాద్య కళాకారుడిని కోరడంతో నవల మొదలవుతుంది. "గోల్ఫ్ మైదానంలో వరింగా (కథానాయిక) కు పిశాచం క ని పిం చిం ది" అంటూ ఆ కళాకారుడు కథ ప్రారంభం చేస్తాడు. అంటే — ఆమెలో మానసికమైన మార్పునకు, ఎక్కడ నాంది జరుగుతుందో, సాంఘిక చైతన్యానికి ఎక్కడైతే అంకురార్పణ జరుగుతుందో, సరిగ్గా అక్కడ కథ మొదలుపెడతాడు మార్పుగాని, చైతన్యంగాని నిజమైనవే అయితే ఏ మనిషిలోనైనా ఒక శుభోదయాన్నే సిద్ధంగా వచ్చి కూర్చోవు. అందుకే రెండు వాక్యాలు కాకుండానే 'ఆగండి! ఒక్కడుగు వెనక్కి వేద్దాం' అని కథానాయిక గతంతో తిరిగి కథ మొదలు పెడతాడు. ఈ శైలి ఆదిలోనే మంత్ర ముగ్ధులను చేస్తుంది.

నవ కెన్యాలో 'ఆధునిక సమస్యలు తొడల సహాయంతో పరిష్కరించబడు

తున్నాయి' కథానాయిక జసింటా వరీంగాకు అందుకే సమస్యలు మొదలయ్యాయి. సమస్యలకి అలాంటి పరిష్కారాన్ని ఆమె తిరస్కరించింది. ఉద్యోగం పోగొట్టు కుంది. ఉన్న గూడు కూడా కోల్పోయి వీధిన పడింది. కసుగాయగా వున్నపుడే తనను ఒక ముసలి పురుగు నులిమేసినపుడు చేసినట్టుగానే ఆత్మహత్యకు ప్రయత్నిం చింది. ఇప్పుడూ బయటపడింది. 'కాని ఈసారి తాను ఒంటరిని కాదు' అన్న భరో సాను రక్షించిన వ్యక్తినుంచి పొందింది. అతడు వరేంగామ ఇల్ మొంచగ్ వెళ్ళ మంటాడు. ఇల్ మొంచగ్ వరీంగా తల్లిదండ్రుల పట్టణం. అయితే అతడు వెళ్ళ మన్నది వారి దగ్గరకు కాదు. అక్కడ జరుగుతున్న 'విందు'కు. ఆనే పిశాచాల విందు.

అసలు అలాంటి విందు జరుగుతుందా అనుకుంటూనే ఆ ఊరు పోయే వాహ నం ఎక్కుతుంది వరీంగా. చోదకుడు వారాతోసహా, అందులోనే ఎక్కిన నలుగురి గమ్యం ఆ విందువేదికే. ఈ సంగతి నెమ్మదిగా బయటపడుతుంది. నవలలో ఈ ఘట్టాన్ని చదవడమంటే- ఒక జాతి జీవన స్రవంతితో కలిసి ప్రయాణించడమే. ఆ స్రవంతిలో వుండే పొంగు, పతనం, ఒంపులు, ఒడిదుడుకులు, నిమ్నోన్నతాలు గూగీ కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తాడు. అది తన జాతీయ జీవన స్రవంతే.

వీరిలో వంగారి బ్రిటిష్ పాలన మీద భేరీ మోగించిన యోధ. స్వతంత్ర కెన్యాలో నిరుపేద. కొత్త ఆర్థిక విధానాలు ఆమెకున్న కాస్త భూమినీ లాక్కుని బికారిని చేశాయి. పని కోసం వెళితే 'పడక పని' తప్ప వేరే పనిలేదన్నది తన వాళ్ళ నుంచి వచ్చిన సమాధానం. మట్టిని నమ్ముకున్న స్త్రీకి, స్వాతంత్ర్య సమర యోధురాలికి దక్కిన గౌరవం అలాంటిది. మరో ప్రయాణికుడు ముటూరి. ఇతడు కార్మికుడు. పోరాటంలో, జాతి నిర్మాణంలో కార్మిక శక్తి 'హృదయం' ఎంత నిర్మాణాత్మకంగా వుండాలో ఈ పాత్ర చేత రచయిత పలికించాడు. 'మనదేశ భవిష్యత్తు గురించి ఆలోచించకుండా, మన కడుపులు గురించి ఆలోచించుకొనేందుకు ప్రోత్సహించి మన కళ్ళు మూయించి జోలపాడే శక్తులకు మధ్య యుద్ధం జరుగు తోందని ముటూరి చెబుతాడు.

వలస పాలన శుద్ధ విదేశీయమైతే, వలస వాద మానసులది - కల్తీస్వదేశీ పాలన మాత్రమే - ఏ జాతికైనా ఈ రెండూ సమంగానే తూట్లు పొడవగలవు. ఇది దేశీయమైన ఆలోచనలకి, జాతీయమైన జాగృతికి తావులేకుండా జాగ్రత్త పడతాయి. 'ప్రజలు తమదేశంలో తాము ఏం చేయాలో విదేశీయులు నిర్ణయించేలా' చేస్తాయి. ఒక జాతిని సజీవంగా వుంచగలిగిన సత్సంప్రదాయాలమీద, కళల మీద, సాహిత్యం మీద, చింతనమీద దాడి చేయడమంటే — ఆ జాతిని శాశ్వతంగా వలస పాలన కింద సమాధి చేయడమేనన్న దృక్పథంతో పునరుజ్జీవనంవైపు పురోగమిస్తున్న జాతికి

ప్రతీకగా మలిచిన పాత్ర గటూరియా పాత్ర. నవల ముఖ్యోద్దేశం. రచయిత లక్ష్యం ఈ పాత్ర ద్వారానే సంపూర్ణంగా అవగాహనకు వస్తాయి. గూగీలో వచ్చిన పరిణామం ఈ పాత్రలో ప్రతిబింబిస్తుంది.

విదేశీ విదేశాలలో ఎం. బి. ఏ. చదివినవాడు - వాహన చోదకుడు వారా 'ప్రైవేటు వ్యాపారుల' జాబితాలోనివాడు. ఐదు షిల్లింగుల కోసం ప్రాణం తీయగలడు. దేవతలొస్తే వాళ్ళని పూజిస్తాడు. పిశాచాలొస్తే వాటిని కొలవటానికి తయారై పోతాడు.

వీళ్ళంతా హాజరైన 'పిశాచాల విందు' సన్నివేశం అద్భుత అంతర్జాతీయ రాజకీయ ప్రహసనం. సామ్రాజ్యవాదం ఎంత వికృతమైనదో, దాని బానిసల ఆలోచనలో ఎంత విషం వుంటుందో. జుగుప్స వుంటుందో కళ్ళకు కట్టడానికి గూగీ చిత్రించిన వ్యంగ్య చిత్రమిది. దోపిడీ కళలో ప్రజల రక్త మాంసాలు హరించడంలో తాము ఎంతటి ఉద్దండ పిండాలలో హ్మ్రాజ్యవాద దాసానుదాసులు సామ్రాజ్యవాద సామ్రాట్టుల ముందు ప్రగల్భించడమే ఈ ఘట్టంలోని కీలకాంశం. ఇందులో గెలిచిన వాళ్ళకి 'అత్యుత్తమ బందిపోటు' మకుటం లభిస్తుంది. అందుకే కొందరు విద్యార్థులు ఈ కార్యక్రమానికి 'పిశాచాల విందు' అని ముద్దుపేరు పెట్టారు.

'దొంగతనం, బందిపోటు తనం' ఒక దేశ ప్రగతికి కొలమానం, అని ఈ విందు సభలో ఒక విదేశీ ఎం. బి. ఏ. సూత్రీకరిస్తాడు. అయితే ఏ దేశాన్ని ఆ దేశ బందిపోట్లు మాత్రమే దోచుకోవాలని, పరదేశ బందిపోట్లని కాలు పెట్టనివ్వకూడదని ప్రతి బందిపోటు ఇంటికెళ్ళి తన కన్నతల్లిని దోచుకోవాలి అని సిద్ధాంతీకరిస్తాడు. అంతేకాదు గాలి, మట్టి మీద ఆధిపత్యం కొట్టేసి వాటిని పొట్లాలలో కట్టి పొదుపుగా విక్రయిస్తే రైతు అనేవాడు ఛస్తే తిరగబడడని గొప్ప చిట్కా కూడా ఇస్తాడు. అయితే పరదేశీ, స్వదేశీ బందిపోట్లని వర్గీకరించడం బొత్తిగా ప్రగతి నిరోధకంగా భావించి విశ్వాహుకులు ఇతడిని వేదిక దించేస్తారు.

'అసలు ధనికులకి, పేదపీనుగులకి ఒకే విధమైన అవయవ నిర్మాణం వుండడమేమి'టని ఒక సామంత సామ్రాజ్యవాది తీవ్రస్థాయిలో అసంతృప్తి పడతాడు. దీనికి పరిష్కారం కూడా ఇస్తాడు. మానవజాతి అవయవాలమీద ధనికులు సంపూర్ణ అధిపత్యం చేజిక్కించుకొని రెండేసి గుండెలు, నాలుగేసి పొట్టలు యధాశక్తిన తగిలించుకుని, చావుని మాత్రం పేదలపాలిట శాపంగా మిగల్చాలని ఆ నిపుణుడు సెలవిస్తాడు. స్వాతంత్ర్యం ముసుగులో ఇలాంటి వాళ్ళు చేసే రాజకీయ వ్యాపారం, విద్యా వ్యాపారం, భూ భాగోతం, 'దొంగరవాణా' వ్యవస్థను ఎంత నీచదశకు తీసుకుపోతాయో, మానవ విలువలను ఎంతగా పరిహసిస్తాయో ఇందులో గూగీ అత్యద్భుతంగా వర్ణించాడు.

నవలలో ఇంతవరకు కథానాయిక వరంగా స్పష్టమైన భావాలు పలకదు. కాని ఈ ఘట్టంలో అంతర్మథనం చెందుతుంంది. తానెవరో తెలుసుకుంటుంది. కెన్యా ప్రతి ఘటనా చరిత్ర నాయికల కల్పనా ప్రతిఫలంగా రూపొందుతుంది. ముందుకు నడుస్తుంది. తన బాల్యాన్ని చిదిమేసిన క్షుద్రుడిని చివర నాటకీయంగా కలుసుకుంటుంది. అతడు తన కూతురికి తండ్రి. తనతో జీవితం పంచుకోదలచిన, తన భావాలతో ఏకీభవించిన మనోవల్లభుడి తండ్రి కూడా అతడే. అయినా కాల్చి చంపుతుంది. గొప్ప మలుపుతో ఇలా నవల ముగుస్తుంది.

'మట్టికాళ్ళ మహారాక్షసి' ఆఫ్రికా మట్టిమీది మమకారంతో గూగీ వ్రాశాడు. కెన్యామీద కమ్ముకున్న సామ్రాజ్యవాద దళారీ పాలనకు వ్యతిరేకంగా దేశభక్తియుత ప్రజాస్వామిక శక్తులు పోరాడాలన్నది అయన అవగాహన. ఆఫ్రికా జాతీయ జీవితంలో, సంప్రదాయంలో వున్న స్థానిక వివేకం ఆయన వివేచనకు, విశ్లేషణకు ఆధారం. ఒక ఆశయంతో పట్టుపట్టి తన మాతృభాషలో ఆ భాష నుడికారంతో గూగీ నవల వ్రాశాడు. సాహితీసృజన జరుగవలసిన దిశను నిర్ద్వంద్వంగా ఎలుగెత్తి చాటాడు.

పదిహేనేళ్ళ విదేశాల్లో గొప్ప గొప్ప డిగ్రీలు చదువుకొచ్చి, జానపద గాథలకోసం వచ్చిన గటూరియాను వృద్ధుడు వేసిన ప్రశ్న ఎంతో గొప్పది. 'సాహిత్యం అంటే జాతీయ నిధి అని వాళ్ళెపుడైనా నీకు బోధించారా?' అన్నదే ఆప్రశ్న. 'తన పిల్లలు ఒక్కొక్కసారి కొంచెం కొంచెం చొప్పున ఎల్లకాలం రుచి చూడడానికి జాతీయాత్మ చిందించిన తేనె సాహిత్యం' అని కూడా ఆ వృద్ధుడు చెబుతాడు. ఈ స్పృహతోనే గూగీ 'గికియు' అందాలను తెలుసుకున్నాడు. సామెతలు నేర్చుకున్నాడు. పొడుపు కథలు విన్నాడు. పురాణ గాథలను తెలుసుకున్నాడు. ఆ తరువాతే నవల వ్రాశాడు. ఎందుకింత తపన? సాంస్కృతిక సామ్రాజ్యవాదమే మానసిక అంధత్వానికి, బధిరత్వానికి జన్మనిస్తుంది. అది సహించలేనివారు ఈ తపన నుంచి తప్పించుకోలేరు.

ఇంత మంచి నవలను తెలుగులో చదువుతున్నపుడు అనువాదం కొంచెం ఇబ్బంది పెట్టేమాట వాస్తవం. రచయిత ఎంతో భావోద్రేకంతో వ్రాసిన కవితల అనువాదం ఆకట్టుకోలేకపోయింది. సౌలభ్యం కోసం ఆ భాష పదాలను కాస్త మార్చినట్టుగానే, ఊతపదాలను కూడా మార్చి వుండవలసింది. ఏమైనప్పటికి ఇంత మంచి నవల తెలుగు పాఠకులకు అందించినందుకు 'స్వేచ్ఛాసాహితి'ని మన స్ఫూర్తిగా అభినందించవలసిందే. →

## ఢిల్లీ గద్దెకోరకు

ఢిల్లీ గద్దెపైన కన్నేసి దొంగసాముల వేషమేసి
రాముని పేరెత్తిరయ్యో—దేశాన్ని
రావణ కాష్టము జేసిరయ్యో—॥రాముని॥ ॥ఢిల్లీ॥

గోమాత రక్షణని గోల గోల జేసి
గంగ జలము గూర్చి కొంగ జపము జేస్తే
గోవు దన్నీపాయె గంగ ముంచీపాయె
జనసంఘ మంతయు నీరు గారిపాయె
ఎత్తులా చిత్తయి ఓటు రాలకపోతే
జనత పార్టిలో జొచ్చిరయ్యా—అట్ల
అధికారమున కొచ్చిరయ్యా ॥దైవా॥
దైవభక్తి యందురా—దీన్ని రాజ్యయుక్తి యందురా
కలెగూర జత గలిపి జనతపాకం జేస్తే
ఉడుకలేని సంఘ ఊడి వేరు పడే
భారతీయ జనతనే బారి అవతానికి
గాంధీ సోషలిజం తిన్న అరగకపోతే
నడుమంత్రపు సిరి నడిచి రావచ్చునని
ఆత్మరాముని కేమొ ఆలయం కడ్డమని
రథయాత్రలు జేసిరయ్యా—ఊరూర

---

→ నవల చివరి వాక్యం పూర్తికాగానే ఒక ప్రశ్న ఉదయిస్తుంది — 'మన సాంస్కృతిక స్రవంతిలో మనం వున్నామా?' అన్నదే ఆ ప్రశ్న. ప్రశ్న రేకెత్తితే జవాబుకోసం అన్వేషణ తప్పదు. అందుకే ఇది గొప్ప నవల.

[ మట్టికాళ్ళ మహారాక్షసి, రచయిత: గూగీ వాధియాంగో, 326 పేజీలు, వెల: 20 రూపాయిలు, ప్రచురణ: 'స్వేచ్ఛా సాహితి' ప్రచురణలు ప్రతులకు, ప్రగతి బుక్‌హౌస్, గాంధీజీ కో–ఆప్ అర్బన్ బ్యాంక్ ఎదుట, మ్యూజియంరోడ్; గవర్నరుపేట–విజయవాడ 520002 ]

కిటుకే పెల్లలు తింపిరయ్యా (మోసిరయ్యో)
రామభక్తి యందురా దీన్ని రాజ్య యుక్తి యందురా ॥రామ॥

ఓట్లు రాలిన తీరు మిరుమిట్లు గొలుపగా
సీట్లు పండిన తీరు కితకితలు రేపగా
అన్న దమ్ములవలె కలిసి పోయిన వారి
పాలనేతులవంటి తెల్లని మనసులో
మతం మంటలు లేపి ఢిల్లి గద్దెను జేర
మసీదును గూల్చి మనుసులనే చీల్చి
కరసేవలని పెట్టిరయ్యో—గూండాల
తండాలను గట్టిరయ్యో
రామభక్తియందురా దీన్ని రాజ్యయుక్తి యందురా— ॥రామ॥

సింహాము పులిగల్సి చిందులేసుకునిరి
సాదు జంతులమని చాటి చెప్పుకొనిరి
అఖిల పక్షాలన్ని మోక్ష మార్గం జూప
చిచ్చు పెట్టిన వాడి అధికార సాక్షిగా
శిలలు నేలగూలె తలలు నేల రాలే
శవాల గుట్టల స్మశాన వాటికయి
అయోధ్య చిచ్చుంటెనయ్యా · దేశము
లంక దహన మాయేనయ్యా
రామభక్తియందురా దీన్ని రాజ్యయుక్తి యందురా ॥రామ॥

సగటు మనుషుల నడుమ ఇనుపగోడలుగట్టి
విభజించి పాలించె తెల్ల దొరల నీతి
కత్తులయి బాయినెటయి చావు కావలిగాసే
కుత్తుకలు తెగుతుంటె మత్తెక్కి చూస్తుండె
దోపిడి చేతులకు నెత్తురంటుకోని
పంట నిచ్చే భూమి పాడుబడి బోతుండె
కష్టజీవులం మనము కల్సి బతుకనీకి
దున్నెటోనికే భూమికై....రైతన్న
దూకి ముందుకు రమ్మురా....కూలన్న ॥రామ॥

—మిత్ర

# చీకటి

పగలంతా రెక్కలు ముక్కలు చేసిన
బక్క పేగుల్లోకి చీకటి పొట్లం మెల్లగా దిగుతుంది
గుడిసెలోని రెక్కలు విప్పుకోని పక్షులు
ఎండిన గొంతుకతో ఎదురుచూస్తుంటాయి
నాలుగిళ్ళల్లో పాచిపని చేసొచ్చిన చీపిరికి
రాత్రి రాక్షసంగా కనబడుతుంది
శరీరమంతా మడ్డి మరకల్ని
పులుముకొన్న పెద్దోడు (వాడివయసింకా ఎనిమిదేళ్ళే)
ఆటోనగర్ నుండి జోగుతూ వస్తాడు
చీకటి పొట్లం గొంతులోకి వొంపుకున్న బక్క పేగు
గుడిసెలోని రాత్రిని కురుక్షేత్రంగా మారుస్తుంది
చీపిరికళ్ళు పాచిన అన్నం నుండి కారే నీళ్ళలా
నీళ్ళు ఓడుస్తాయి
ఒక్కోడు చీపిరిపై ఎందుకు విరుచుకుపడతాడు
అర్థం కాదు రెక్కరాని పక్షులకి
బొడ్లో దోపిన ఇంకో పొట్లం
గొంతులో వొంపుకొని కూలబడతాయి బక్క పేగులు
మురిగ్గుంటో, పట్టు పరుపో తెలీని
బ్రతికున్న శవంలా పడి పొర్లాడుతాయి
బయట మెర్క్యూరీ దీపాల కాంతి
దేదీప్యమానంగా వెలుగుతున్నా
గుడిసెలో మాత్రం కిరసనాల సీసా
కునారిల్లుతూ వెలుగుతుంది
వెలుగులేని ఆ చీకటి బ్రతుకులకి
అంత కంటె వెలుగెందు కనుకొని
రాత్రి గడిచిపోయిన తరువాతి పగలు
మళ్ళీ మామూలే
మూడుండల బండితో బక్క పేగులు
పెద్దింట్లో కసువు చిమ్ముతూ చీపిరి
మడ్డి మరకల్తో పెద్దోడు
గుడిసెలో రెక్కరాని పక్షులు.

— బండ్ల మాధవరావు

# ఏసురాజు పీరు పంతుల్వార్ధము

మావా !

మనదేశంలో మతం గొడవలు ఎక్కువయి పోనాయి. లచ్చనంగా "ఎవుడి పూజలాళ్ళు జేసికోండిరా" అంటే, ఒకడు 'కరసేవ' అంటాడు. మరోడు 'నమాజు' అంటాడు. అసలు యిన్నాళ్ళులేని గొడవలు యిప్పుడెందు కంత ముదిరి పోనాయో నాకు తెలవటంనేదు. అయ్యన్నీ నీకే తెలవాల !

అయినా కొందరు పెద్ద మడుసులు 'ఇందువు'లే మడుసులంటూ కేకలేస్తుంటే మిగతా మడుసులేటయిపోవాల ! 'ఇందువు' లెక్కువున్నారు గాబట్టి, మైనారిటీ వోళ్ళ వోట్లు నేకపోయినా గట్టెక్కేయొచ్చని ఆళ్ళ ఆశ కాబోలు. వొచ్చే ఎలచ్చన్లో నిన్ను 'దింపేసి' ఆళ్ళు ఎక్కేయొచ్చని మురిసి పోతున్నట్టుండారు. కాని మావా ! నువ్వు సానా తెలివయినోడివి. ఎత్తుకు పైయెత్తేసినావు. ఆళ్ళను అడ్డెట్టుకొని మసీదును కూలగొట్టేయించినావు మరుసటి రోజునే మళ్లీ మసీదు గట్టిత్తానని జెప్పి పూనకం వచ్చి ఊగిపోతన్న 'పీర్లు' మొకం మీద సన్నీళ్ళు జల్లేసినావు. ఆళ్ళు సల్ల బడిపోయిన రెండో రోజునే 'రావణుత్తుల్ని' పూజసేసుకోమని ఆర్డర్లిచ్చేసినావు. నువ్వు సేసిన పనులన్నీ నాకు సానా బాగా నచ్చినాయి. ఆ 'తెల్లోడిని' మరిపిచ్చేసినావు. కాని మావా !— నా మనసులోని మాట ఒకటి సెపుతాను- ఓట్లు కోసం, సీట్లుకోసం ఎగబడి జనాన్ని 'మనం' ఏడిపిత్తన్నాంగాని— సక్కని మసీదు, ఐవొందలసంవచ్చరాలనాటి ముచ్చటయిన మూడు గుమ్మటాల మసీదు కూల్చేసిన రోజున నా మనసు సివుక్కుమని పోనాది గందా ! అయినా యిట్టాటి ఎదవ పనులు యింకా ముందు ముందు ఎన్ని సెయ్యాల్సొత్తాదో ననుకొని, నా మనసుకి నానే సద్ది సెప్పుకుని 'మావకి జిందాబాద్' అని గొంతెత్తి అరిసేసినాను.

కాని మావా ! యిట్టాటి సమయాల్లోనే మనం సానా నట్టబోతన్నావని నా కనిపిత్తా ఉంటాది. ఏటికంటే—మన రాంబాబులేడూ—ఆడు 'బాబు' కాదు 'బాంబు' ఆడేకాదు యీ యిప్లవాలు నడిపేవోళ్ళందరూ కాసుగ్గూకున్నారు. సమయం జూసి 'అసలు యిసయాలన్నీ' బయట పెట్టేత్తన్నారు. బిటిసోడి కాడి నుంచి నీదాకా మతాన్ని అడ్డెట్టుకుని 'ఇబజిచ్చి' దేశాన్ని ఎలా 'పాలిచ్చారో'.... అన్ని యివరాలు సెప్పేత్తూ ఆ రాంబాబు మొన్న మీ ఊళ్లో మీటింగెట్టిండు. నా కయితే ఒళ్ళు మండి పోనాది. ఎంటనే మన 'ముూ' వోళ్ళని బంపి ఆడిని అక్కడి కక్కడే సంపిచ్చేద్దామను కొన్నాను. కాని మనం 'పెజా సోమ్యవాధులం, అతి పెద్ద లౌకికవోదులం,

శాంతి కాముకులం' అని కొత్త తగ్గాను. అలాంటి పనులు మనం 'జనం'లో సెయ్య కూడదు గందా ! మన దంతా 'ఎన్నుపోటు' యవ్వారం.

ఆడు ఏటంటన్నాడో తెల్సా— జనంలో 'మతం' నేదంట. అందరూ మత సామరస్యంతో జీవిత్తన్నారంట. మనపే పనిగట్టుకుని 'ఓట్లుకోసం' యీళ్ళందర్ని సీల్చేత్తన్నామంట. కట్టపడే వోళ్ళందరిది ఒకటే పతవట. మొన్న హైదరాబాదులో మా 'ధనార్జన బావ' సింహాసనం ఎక్కటానికి ముందు జరిపిచ్చిన కల్లోలంలో సాయిబులు- యిందువులు' కల్సి 'భాయి-భాయి' అనుకుంటూ మన 'మురా' వోళ్ళని తనన్నింట. అట్టాటప్పుడు పేదోళ్ళలో 'మతం' ఏడుందని జనాన్ని నిలదీసి అడిగే సిండు. యిట్టాటి 'రగస్యాలన్నీ' జనానికి ఆడు సెప్పేత్తుంటే నాకు పేణం కుతకుత లాడిపోనాది. మన ఎత్తులు, జిత్తులు యీడికి తెల్సిపోనాయేనని లోపల్లోపల కుళ్ళి పోనాను. అయినా అప్పుడాడిని నానేటి సెయ్యనేక పోనాను. ఆడు 'జనం' లో ఉండిపోనాడు. మనదంతా దొంగదెబ్బ కదా ! దొంగసాటుగా బట్టుకొని కొండల పక్కకో, సెట్ల పక్కకో తీసుకెల్లి 'కాల్సియగలం' తప్ప- ఉండపళంగా ఆడిని 'జనంలో సంపితే 'జనం' రెచ్చిపోతారు. అందుకే ఆడినాగ్గేసాను. కాని నకు తెలవకుండానే మన మురావోళ్ళు రెచ్చిపోయి ఆడిని కాల్చేసినారు. దాని సంగతి తరవాత సెపుతాను. యింకా ఆడేటన్నాడో యిను—

ఎనకటి సెరిత్రలోకి బోనాడు— మనం బిటిసోడి కాళ్ల పిసికేటోళ్ళమంట. యీ 'మసీదు-మందిరం' మంట ఆడు బెట్టిందేనంట. యీ నలపై అయిదేళ్ళా ఆ 'మంట' ను జాగర్తగా సూసుకుంటూ మనం సలి కాసుకుంటున్నామంట. ఆ మంట సల్లారి పోతున్నప్పుడల్లా పేదోళ్ళని, బీదా బిక్కి జనాన్ని, మతం-మట్టి గడ్డలు ... ఏటీ తెలవని అమాయకుల్ని- అళ్ళు 'యిందువు' లయినా, 'ముస్లిం' లయినా... ఎవ్వరయినా కట్టం జేసుకుని బతికే కూలోళ్ళని పుల్లల్లాగ యిరిసి ఆ 'మంట' లో ఏసి మళ్ళీ మనం 'సలికాగుతున్నాం' అంట ! సూసినావా మావా ! అడు ఎట్టాటి మాట లంటున్నాడో..... యీరకంగా ఆడు పేదోళ్ళందర్ని రెచ్చగొడుతుండు. కులం, మతం నేకుండా అందర్ని కలిసి పొమ్మంటుండు. అట్టా జరిగితే యింకేటన్నా ఉందా ! మనం, మనం— అంటే మనం అయినా, పెతిపచ్చం వోళ్ళయినా ఆ 'సట్టసభ'లో కూకుండే వోళ్ళ మందరం — మన డబ్బునోళ్ళందరం ఏటయి పోవాల ? సెప్పు మావా- సెప్పు ?

ఆడు యింకా పూర్వకాలానికి పోయిండు. పెజలు అడవుల్లో జంతువుల్లాగా బతికేటప్పుడు—గుడ్డ కట్టుకోటం-తిరంగా ఓ సోట ఉండటం తెలవనప్పుడు— మడిసి సానా 'బయం'లో బతికే వోడంట, పాము కరిసినా, ఆకాశంలో 'మేగం' వురిమినా, వానొచ్చినా వరదొచ్చినా, బూకంపం వొచ్చినా, అడివంటుకు పోయినా,

ఆడదానికి కడుపొచ్చినా, దాని శరీరంలోంచి ఓ బిడ్డ పుట్టినా... యియ్యన్నీ 'ఆనాటి మడిసి'కి ఏటి తెలిసేది కాదంట. అన్నిటికి బయపడిపోయి ఎవడో 'పైనునోడే' యీ పనులన్నీ సేత్తున్నాడని ఓ దణ్ణం పెట్టిండంట. ఆ 'దణ్ణ' మే 'దేవుడ్' ని పుట్టించిందంట. ఆ రకంగా—'బయంలో పుట్టిన దేవుడు - దోపిడీలో పెరుగుతూ- సమతలో సచ్చిపోతాడంట'—అంటే ఆడి దుట్టిలో మనం దోపిడీలు సేసేవోళ్ళమని మన దోపిడీ రాజ్యమే దేవుణ్ణి బతికించి, మరాల్నీ నిలబెట్టుకుంటోందని ఆడు సెబుతుండు. సూసావా మావా- యీ లెక్కని ఆడు నాకాక్కూడా తెలవని యిసయాలు సెప్పుకు బోతుంటే నానే కిటికీలోంచి సెవులుగ్గేసి యిన్నాను. యిక జనం ఆగుతారా ! యిరగబడి పోతున్రు. నాను ఆడినేటి సెయ్యనేక పోతన్నాను.

సివరకాడు సెప్పేదేంటంటే—అసలు 'యిందువు' అంటే ఎవడు ? ఆడిది 'రాజు'ల రక్తమా ? ఎప్పుడో ఎయ్యేళ్ళ కితం యీ దేశానికొచ్చిన 'తురక'ల రక్తమా ! ? ఆ తరవాతొచ్చిన 'బిటిసోడి' రక్తమా ? ? ? ........ ఈ దేశం మీద దండెత్తిన పెతివోళ్ళూ యీ దేశంలోని ఆడకూతుళ్ళని సెడగొట్టిపోనారు. ఆళ్ళందరికి కడుపులొచ్చినాయి. బిడ్డలు పుట్టినారు— ఈ 'రక్తం' ఎవుడిదని మీరు నిర్ణయిత్తారు-సెప్పండి అని ఆ రాం'బాంబు' జనాన్ని నిలదీసిండు మనని పాలించిన ఆ తల్లి 'ఇంద్రాజీ' ఎవడిని పెళ్ళాడింది ? ఆమెకు పుట్టిన బిడ్డది యిందూ రక్తమా తురక రక్తమా ? ఆ పుట్టి పెరిగిన బిడ్డడు కూడా మనని పాలించినాడు. అడు ఎవరిని పెళ్ళాడినాడు ! ఆడికి పుట్టిన బిడ్డల్ది ఏమతం రక్తం ? ఏదేశం రక్తం ?.... యీడి మాటలకి జనం బిక్కచచ్చి పోనారు. నాను నా యింట్లో గూకుని కిటికీ లోంచి సూత్తానే ఉన్నాను. మన 'పురా' వోళ్ళు 'ఆడిని సంపేత్తాం' అని పోన్లు మీద పోన్లు సేత్తానే ఉండారు. నాకయితే బి.పి. పెరిగి పోనాది. కాని ఏటి సెయ్యనేక సేవ సచ్చి నోడిలా కూకుండి పోనాను. ఆడేత్తున్న ఒక్కొక్క పెశ్న ఎయ్యి నిలువుల గొయ్యి తీసి అందులో నన్ను కూకుండ బెట్టేసినట్టుంటాది.

సిట్ట సివర కాడేటన్నాడంటే—మనం 'యిందువులం' కాదు. 'తురకలం' కాదు. కిరస్తానీ'వోళ్ళం కాదు.... ఈళ్ళందరి 'అంశ' తో బుట్టిన దత్తాత్రేయుల మన్నాడు. ఈడి పేరు 'ఏసురాజుపీరుపంతుల్నాయుడు'. ఈడి జాతి 'ఏసురాజు పీరు పంతుల్నాయుడు' జాతి, యీడి మతం 'ఏసురాజు పీరు పంతుల్నాయుడు' మతం; యీడి కులం 'ఏసురాజుపీరుపంతుల్నాయుడు' కులం; పంతులంటే— సెరిత్ర మొదటి నుంచి కూడా మంచికైనా సెడుకైనా రాజ్యా లేలేవోళ్ళకి పక్కనే ఉండి, ఆలోచన న్నిచ్చే మేధావులంట, నాయుడండే శూద్రులని సెప్పబడే అన్ని కులాలోళ్ళూనంట ! మనమేకాదంట పొట్టతిప్పలకోసం ఒక దేశం యింకో దేశం మీద, ఒక జాతి

(తరువాయి 32వ పేజీ)

పుస్తక సమీక్ష

# మారుతున్న కాలానికి ప్రతిబింబం

## — డాక్టర్ అఫ్సర్

కాలం కంఠస్వరాన్ని పోల్చుకోలేనివాడు కవిగా ఉనికిని కోల్పోతాడు. ఎల్ల కాలం ఒకే కంఠ స్వరంతో పలికే కవి కూడా అంతే. కవిత్వం సమాజ స్వరాన్ని గుర్తుపట్టాలి. అంతేకాదు, సమాజంలోని అంతర్ వైరుధ్యాలని పట్టుకోగలగాలి. అద్దేపల్లి రామమోహనరావుగారి 'గోదావరి నా ప్రతిబింబం'లో ఈ అంతర్ వైరుధ్యాల ప్రతిఫలనం నిర్దిష్టంగా కనిపిస్తుంది. ఈ ప్రతిఫలనానికి మచ్చుతునక అద్దేపల్లి రాసిన 'ఆకాశాన్ని కదిలించిన పాతాళం' కవిత.

పాతాళం పాట ప్రారంభించిందనగానే
ప్రజలంతా విత్తరపోయారు
ఇంతవరకూ ఆకాశమే పాడుతోందని వారికి తెలుసు
ఆకాశమే పాతాలని వారి విశ్వాసం ....

ఆధునిక తెలుగు కవిత్వంలో 80ల తర్వాతవచ్చిన గుణాత్మకమైన మార్పుని తొలిగా గుర్తించిన ముందుతరం కవుల్లో అద్దేపల్లి ఒకరు. ఈ మార్పు ఆకాశానికీ పాతాళానికీ మధ్య వున్న తేడా. ఆకాశం ఇక్కడ ఉన్నత వర్గాల భావజాలానికి ప్రతీక. పాతాళం దానికి పూర్తి విరుద్ధం. 80 తర్వాత కవిత్వం అంతా ప్రధానంగా అట్టడుగు మధ్య తరగతి, పీడితవర్గాల కేంద్ర బిందువు నుంచి వచ్చిందే. ఇది 'పాతాళం' నుంచి వచ్చిన తరం. అందుకే, ఈ తరంలో ఎక్కువ భాగం మైనారిటీలు, దళితులు, స్త్రీలు వుండడం యాదృచ్ఛికం కాదు.

మొదట ఇది కవిత్వం కాదని ప్రతిఘటించిన వాళ్ళున్నారు. వీళ్ళకి నేపథ్యం లేదని, ఇందులో పలుకులేదని, వీళ్ళు పంజరంలో చిలకల్లా పలకట్లేదని అన్నవాళ్ళున్నారు. ఈ కవులు మొదట వస్తువు పేరిట ఏర్పర్చిన విధి నిషేధాల్ని నిషేధించారు ఆ తర్వాత అరిగిపోయిన శబ్ద పంజరం నుండి బయటపడి కొత్త స్వేచ్ఛాస్వరంతో మాట్లాడడం మొదలుపెట్టారు. అప్పుడు —

పాతాళం పాటకి వాళ్ళు చెవులు మూసుకున్నారు
పాతాళం పాటని వాళ్ళు అవహేళన చేశారు
పాతాళం పాటని వాళ్ళు అపశ్రుతులని దుష్ప్రచారం చేశారు

అద్దేపల్లి ఈ మూడు పాదాల్లో మూడు అంశాల్ని పాఠకుడిముందు వుంచారు. మొదటిది శబ్దానికి సంబంధించింది. రెండోవి వస్తువుకి సంబంధించింది. మూడోది

నిర్మాణ నిర్లక్ష్యానికి సంబంధించింది. తెలుగు కవిమీద నిందవేయడం తేలిక. చాలా మామూలుగా వీళ్ళకి 'శబ్దం' తెలియదు అని కొట్టి పారేయవచ్చు. అత్యాధునిక కవి ముందు ఈ 'శబ్దం' ఆధిపత్యాన్ని జయించాడు. శబ్దం కంటే భావం బలమైందని నిరూపించాడు. ఈ భావ ప్రాముఖ్యతని గుర్తించారు కాబట్టే అద్దేపల్లి —

ఖండ ఖండాలుగా నరకడానికి పద్యం చదివితే

అఖండంగా అది గుండెపై చెదరని ముద్ర వేస్తోంది

అనగలిగారు.

ఆధునిక కవిత్వంలో ఈ తరహా కవిత్వాచేకి సమాధానం చెప్పడానికి 'అర్థం కాని పాటల' ఆసరా కావల్సి వచ్చింది. కొంతమంది ఉద్యమ నేపథ్యం నుంచి వచ్చిన కవులే కృత్రిమ శబ్ద జాలంలోకి ప్రవేశించడం ఇక్కడ గమనించాల్సిన అంశం. నిజమైన భావాలకీ, భాషకీ మధ్య జరుగుతున్న సున్నితమైన యుద్ధంలో ఇలాంటి కృత్రిమ కవులు 'అర్థంకాని' వివాదాలు తీసుకువచ్చారు. ఇలాంటి కవిత్వం-

ప్రజల గుండెల్ని తాకకుండా
తలలపై నుండి ప్రయాణించి
మళ్ళీ ఆకాశంలోనే విలీనమయింది

తల అంటే ఇక్కడ మార్క్సిస్టు పరిభాషలో ఉపరితలం అనే - పునాదితో సంబంధంలేని ఉపరితలం చర్చగా ఇలాంటి వివాదాలు మిగిలిపోయాయి.

అత్యాధునిక కవిత్వం ప్రారంభమై ఇప్పటికి దశాబ్దం గడిచిపోయింది. కావ్య భాష అనే ఆకాశాన్ని సామాన్యుడి 'పాతాళ భాష' కదిలించింది.

పాతాళం పాడిన పాట
నేలని చీల్చుకుని పైకి వచ్చి
ప్రజలందరికీ అపూర్వ మాధుర్యాల్ని చవి చూపింది

కవి అన్నవాడు తనని బతికిస్తున్న మట్టిలోని ప్రతి రేణువుని అక్షరంగా మలుచుకుంటాడు. అలా కాకుండా ఆకాశ మార్గాన ప్రయాణిస్తానంటే కాలం అతన్ని మింగేస్తుంది. ఈ మట్టిమీద నిలబడి మాట్లాడలేని కవి ఇప్పుడు **IRRELEVANT.**

అద్దేపల్లి 60ల నుంచి రాస్తున్న కవి. సమకాలీన సాహిత్య సందర్భాలమధ్య ఎప్పుడూ ఆయనది అసందర్భ స్వరం కాదు. పైగా సంప్రదాయక మార్గం నుంచి క్రమంగా ఆధునిక మార్గానికి మళ్ళిన కవి. ఈ రెండు రూపాల సంఘర్షణ ఆయన తొలి వచన కవిత్వంలో కనిపిస్తుంది. 'గోదావరి నా ప్రతిబింబం'లో ఆయన రూపం స్పష్టంగా వుంది. ఈ రూపంలోకి ప్రయాణించడం అనుకున్నంత సునాయాసంగా జరగని పని. అందుకే ఆయనకు ఒకప్పుడు

గోదావరి నన్నయ పద్యాల్లా శ్రీనాధుడి సీసాల్లా కనబడింది
యిప్పుడు
జీవితాన్ని కూడా అర్థం చేసుకున్నప్పుడు
దోవ పొడుగునా పోరాటాల్ని మోసుకుపోతున్న
పరమాణు ప్రవాహంగా కనిపిస్తోంది

**మొత్తం**గా తన జీవితానికీ, పరిసర జీవన ప్రతిఫలానికీ ఈ కవి గోదావరిని ప్రతీకగా తీసుకున్నారు. ఇది సందిగ్ధ ప్రతీక కాదు. మారుతున్న కాలానికి ప్రతీక !

['గోదావరి నా ప్రతిబింబం' అద్దేపల్లి రామమోహనరావు కవిత్వం-వెల: 15 ప్రతులకు 'జీవన సాహితి', 29-6-13 డి, పురాణ పండవారి వీధి, రాజమండ్రి — 533 104 - లేదా ఎ. అన్నపూర్ణ, పురంవారి వీధి, జగన్నాథపురం, కాకినాడ - 533 002.]

---

( 29 వ పేజీ తరువాయి )

యింకో జాతి మీద దాడులు జరుపుకుని సివరికి పెపంచకం అంతా 'మైల' పడిపోనా దంట. ఆ 'మైల' లోంచి పరిశుభ్రమైన మానవుడు పుట్టిండంట. యీడికి జాతి, మత, కుల, ప్రాంత బేదం నేదంట.

'కడుపు సించుకుంటే కాళ్ళ మీద పడద్ది'. యీహూతరం దానికి 'మతం' అని, 'కులం' అని గొంతు సించుకోటం ఏటికి ? 'మందిరం-మసీద' ని ఆవేశకావేశాలు దేనికి ?.... యిట్టా ఆడు- ఆ రాం 'బాంబు' గాడు సెప్పుకు పోతా వుంటే సివరకు ఉండబట్టనేక మన 'మురామేత్రి' ఒకడు ఆడిని తుపాకీతో కాల్చిసినాడు. ఆడు సచ్చిండో, బతికిండో తెలవటంనేదు. జనం అంతా సెల్లా సెదురయి పోనారు. నానే కాల్పించినానని జనం నా యింటి మీదికి ఎగబడుతున్నారు. సుట్టు పోలీసుల్నెట్టుకు గూకున్నాను. యిలాంటప్పుడు ఆళ్ళే కదా మన రచ్చకులు ! సువ్వు ఏటి సేత్తావో- నీ యెత్తులన్నీ ఉపయోగిచ్చి నన్నీ అపాయం నుంచి కాపాడాల. అటుసారా ఉద్దెమం ఒచ్చి నా యాపారం బోయింది. యిటు మత ఉద్దెమం నా పేణానికే వొచ్చింది. సివరకు మనం తీసుకున్న గోతిలో మనవే పడ్డట్టుండాది. నన్నీ అపాయంనుంచి నువ్వే కాపాడాల.... ఎప్పుడూలేని భయంతో సత్తన్నాను. నీ 'ఫోను' కోసం ఎదురు సూత్తూ—

నీ మేనల్లుడు
కత్తుల కాంతయ్య

# మన మంతా మానవులం - మన దంతా ఒకే కులం?

కులం కులం కులం కులం
ఎక్కడిదీ పాడు కులం ?
పాపిష్టి యీ వర్ణాశ్రమ వ్యవస్థ
ప్రజాస్వామ్య భావనకే దురవస్థ!
మాతృదేశ విముక్తి కోసం
మనుషులమంతా వొక్కటిగా
వందే మాతర మంటూ
ముందూ వెనుకలు చూడక
లాఠీలకు తనువు లిచ్చి
తూటాలకు రొమ్ములిచ్చి
ఉరి కొయ్యలు కౌగలించి
చెరసాలలు నింపి నింపి
పరప్రభువుల తరిమేదాకా
ఒక్కటిగా పోరాడామే !
అనా డెక్కడుందీ కులం ?!
ఈనాదెలా వచ్చింది దానికీ బలం ?

॥కులం కులం॥

ఆకలి మంటల మలమల మాడే
అనాథలంతా లేవండం'టూ
అంతర్జాతీయ పక్షమే
అశేష మానవ కుటుంబమంటూ
అసంఘటిత వర్గాలను
ఐక్యశక్తిగా మలచీ
అరుణారుణ దీప్తులతో
హక్కుల సమరాంగణాన
ఒకే మాట ఒకే బాట
వొక్కుమ్మడి పోరాడామే....
అనాదేమైందీ పాపిష్టి కులం?

॥కులం కులం॥

కందుకూరి, గురజాడలు
అందించిన సాహితీ మందారాలను
జనారణ్యాన విత్తి వికసింపజేసి

స్త్రీ అంటే అబల కాదని
సాహసిస్తే స్త్రీ శక్తి కెదురులేదనీ
మూఢత్వం మాడు పగలగొట్టి
మూర్ఖత్వం కీప్పు సడలగొట్టి
బురఖాలను బద్దలుగొట్టి
పిరికితనం తరిమికొట్టి
అవిద్యతో అజ్ఞానంతో
అసహానం ఆక్రందనలతో
వరకట్నపు దురాచారాలతో
గడప దాటరాదనే కట్టడులతో
సహగమన దుశ్శాసనాలతో
అణచబడిన అమ్మలంతా
మేమూ మనుషులమంటూ
సాగిన నాటి ఉద్యమాల్లో
ఏ తల్లిది ఏ కులమో
ఎవరైనా తలపోశారా ?

॥కులం కులం॥

జులాయి తిరుగుళ్ళతో
జూదాలూ పేకాటలతో
దుర్వ్యసనాల పాలవకుండా
దుష్కృత్యాల దరి జేరకుండా
యువత సంఘటిత పరచి
ఉద్యమాల బాటకు మలిపి
ఆదర్శపు నడవళ్ళతో
ఆటలతో పాటలతో
సామాజిక సేవలతో
చైతన్యం వెలయించీ
భగత్సింగు వారసులుగ
ప్రగతిబాట నడిపించిన
నాటి యువజనోద్యమాల్లో
చోటుందా యీ కుల రాక్షసికి?

॥కులం కులం॥

భూమి కొరకు-భుక్తి కొరకు,
పీడితుల విముక్తి కొరకు
'సంగం'తో - సంగమమై
సామాన్యులు సాయుధులై
'ఒక వీరుడు మరణిస్తే
వేల కొలది ప్రభవిస్తూ'
దారుల పొడవున రక్తం
ఏరులుగా పారిస్తూ
రక్తాక్షర లిఖిత చరిత
రణరంగం తెలంగాణా....
సాగిన ఆ సమరంలో
అందరిదీ ఒకే కులం!
అదే నాటి జనం బలం

॥కులం కులం॥

నాడులేని ఈ కుల రక్కసి
నేడెందుకిలా వికటాట్టహాసం
జేస్తుంది?
అంతా మన స్వయంకృతా
పరాధమే!
స్వాతంత్ర్యమైతే సాధించాం
ఈనగాచి నక్కల పాలు జేశాం!
జాతిపిత సూక్తులకు
తద్దినం పెట్టి
చేతులు దులిపేసుకుంది అధికారం!
ధర్మకర్తృత్వం నుండి
ధర్మం అంతర్ధానమైపోయింది!
అస్పృశ్యత అంతరించకపోగా
అందలాలెక్కి వెక్కిరిస్తుంది!
సత్యాహింసలు పోలీసు లాకప్పుల్లో
హత్యలు కాబడుతున్నయ్!
ఇదొక విషవలయం!

॥కులం కులం॥

సుజలాం, సుఫలాం!
సస్యశ్యామలమే!
సొమ్మొకరిదీ—సోకొకరిది!
కాకుల్ని గొట్టి గద్దల కేస్తుంది అధికారం!
జాతీయోద్యమ వారసత్వాన్ని
స్వీకరించవలసిన విప్లవ శక్తులు
సిద్ధాంత రాద్ధాంతాలతో
చిందర వందర గావటం
చెప్పలేనంత నష్టం చేకూరింది!
ధనస్వామ్యపు దగుల్బాజీలంతా
మొనగాళ్లై మీసాలు మెలివేస్తున్నారు.
శ్లేష్మంలో పడిన ఈగలా
సమాజం దిక్కుతోచని స్థితిలో వుంది!
ఏబదేళ్ళుగా పెరుగుతూ వస్తున్న
విష సంస్కృతీ వటవృక్షాన్ని
కూకటి వ్రేళ్ళతో కూల్చివేయాలి.
ఎప్పటికైనా విప్లవ శక్తులు
ఏకం గావాలి. విక్రమించాలి
మనమంతా మానవులం !
మనదంతా ఒకే కులం ! !
సమసమాజ సంస్థాపనమే
సర్వేజనా స్సుఖినోభవంతు.

-తిరునగరి రామాంజనేయులు

# పిల్లల ప్రపంచం





## మీకో మిత్రుడ్ని పరిచయం చేస్తున్నా -

ముందుగా మన పిల్లలందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు అందచేస్తున్నా. ఈ సారి మీ చేతికి ఈ పుస్తకం అందే సరికి మీరు మీ స్నేహితులకి, మాస్టార్లకి, ఇంకా చుట్టాలకి గ్రీటింగ్ కార్డులు పంపించటమూ, వారి నుండి మీరు అందుకోవటం లాంటివి జరిగిపోయి ఉంటాయి.

ఈ కొత్త సంవత్సరంలో మీకో మిత్రుడ్ని పరిచయం చేస్తున్నా -

తనేమో 'మహేష్.' 'విశాఖ'లో ఉంటున్నాడు. వాళ్ళ బాబాయిగారు [దళిత్] కవితలు రాయమనగానే 'బజ్జి మిరపకాయలు' పేరుతో చాలా కవితలు రాసేడు. కొన్ని కవితలకి 'బాపు' తాత గారూ, 'టి.వి' తాతగారూ బొమ్మలు వేశారు. తన కవితలు కొన్ని 'అనిల్ స్వాతి' వారు కూడా వేశారు. అదిగో ఆ మహేష్ కవితలు ఈ నెల నుండి ప్రచురిస్తున్నాం. వీలయితే బొమ్మలూ వేస్తాం.

'మహేష్' లా పిల్లల ప్రపంచం'కు మీలో ఎవరు రాసి పంపించినా, ఏ మాత్రం బాగున్నా ప్రచురిస్తాం. మీరు చేసిన బొమ్మలు అయితే అవి కూడా.

## కొత్త సంవత్సరం ఎందుకు?

మీరందరూ సంతోషించటానికేకాదు. గ్రీటింగ్‌లు పంపించుకుంటారనే కాదు. ఈ ప్రపంచమంతా అందంగా, మీ నవ్వులంత హాయిగా సాగిపోవాలని కోరుకుంటూ, అందుకు మనం ఏం చేస్తున్నాం అనే విషయాల్ని వెనక్కి తిరిగి చూసుకోవటానికి కూడా.

అందుకే పోయిన సంవత్సరం మీరేం తప్పులు చేశారో మీరే గుర్తుకు తెచ్చుకొండి. ఒప్పుకొండి.

అలాగే ఈ సంవత్సరం మీరు ఏం చేయాలనుకుంటున్నారో నిర్ణయించుకొండి. మరి నేను ఉంటాను. రాబోయే సంచికల్లో మీకు మరింత సంతోషాన్ని, ఈ రెండు పేజీల నిండా పంచాలనే నా ఆరాటం.

మీ

— అంకుల్

'మా చిన్నాన్న రాయమన్నారు
నన్ను కవితలు
అర్థం చేసుకోలేదు నా బాధలు →



నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd., డి. సి. ఎమ్. ఎస్, బిల్డింగ్స్, ఎస్. ఆర్. పేట, ఏలూరు.

→ వాళ్ళ స్నేహితునికి చూపించాలట
నా కవితా రూపం
అందుకని నన్ను ఇలా బాధపెట్టడం
కాదుగా భావ్యం'
- ఇది మహేష్ పంపిన కవితల్లో చివరిది. అయినా ముందుగా ఇస్తున్నాను' తన కవితను చూడగానే నాకూ రాయాలనిపించింది.

'మహేషూ చెబుతున్నా ఓ శేఖరూ
కాదోయీ కవిత్వం మాకు బాధ
అది వివరించును మాకు పిల్లలమేధ'
ఇంకా తను ఇలా అంటున్నాడు
'అదిగదిగో పండు
దానిలో పురుగులుండు
దాని పేరే మేడిపండు'
(మీరు ఆ 'పండు' చూశారా?)

## పెద్దల సం

గత కొన్ని నెలలుగా 'పిల్లలప్రపంచం' శీర్షికను మీరు గమనిస్తూనే ఉండి ఉంటారు. 'ప్రజాసాహితి' లాంటి 'సీరియస్' పత్రికలో, అందులోనూ సాహితీ, సాంస్కృతిక విషయాలకు చెంది పెద్ద చర్చలు జరుగుతుండే పత్రికలో ఈ శీర్షిక నిర్వహిస్తే ఎలా వుంటుంది. అనే ఆలోచన వచ్చింది. ముందుగా నేను ప్రారంభించి క్రమంగా పిల్లల రచనలతోనే ఈ శీర్షికలోని పేజీలు నింపాలని అనుకున్నాం.

కేవలం ఓ శీర్షిక కోసం మాత్రం 'పిల్లల ప్రపంచం' నిర్వహించటం లేదు. ఈ శీర్షికపై మీ ప్రతిస్పందన కావాలి. బాలల్లో రచనల పట్ల ఆసక్తిని చిన్నతనం నుండే రగిలించాలి. 'పుస్తకాలు చదవటం' అనే అలవాటుని పిల్లల్లో కలిగించః పక్షంలో రానున్న కాలంలో ఇంకా విషాదకర మార్పులు చవిచూడాల్సి ఉంటుంది.

రేపటి పాఠకుల్ని, 'రేపటి రచయితల్ని, కవుల్ని, మనం ఇప్పటినుండి తయారుచేసుకోవాల్సిందే,

అందుకే 'పిల్లల ప్రపంచం' కోసం మీ పిల్లల్ని ప్రోత్సహించండి. వారిలోని సృజనాత్మక శక్తులకు 'పిల్లల ప్రపంచాన్ని' ఓ వేదిక చేయండి.

అభినందనల్తో

— పి. చంద్రశేఖర అజాద్





# శవం

సముద్రంలో కదులుతున్న అలలకూ
అలలుకనే కలలకూ
సముద్రగర్భంలో జ్వలిస్తున్న లావాలకూ
ఇన్నాళ్ళూ మౌనసాక్షిగా ఉన్న శవం ....
అర్ధ శతాబ్దంపాటు దీర్ఘనిద్రలో ఉన్న శవం
దహన సంస్కారం కాక దయనీయంగా పడి ఉన్న శవం
ఇప్పుడు మెల్లిగా కదులుతున్నది—
సముద్రంలో చెలరేగుతున్న కల్లోలాన్నీ
కలవరపడుతున్న అలల కలలనూ చూసి
'శవం' సంబరపడుతున్నది
సర్వశక్తులూ కూడగట్టుకుని లేచే విఫల ప్రయత్నం చేస్తున్నది
జన్మభూముల వివాదాల మధ్య / పునర్జన్మకు యత్నిస్తున్నది
మావిరసం తాకి సన్నగా మూల్గుతున్నది —
రా నేస్తం !
ఈ శవం పునరుత్థానం చెందక ముందే
ఈ శవం ఒక సవాలై పరిణమించక ముందే
పత్రికల పరిధులు దాటి ఇది విశ్వవిద్యాలయాలకు
విస్తరించక ముందే
ఇదొక నమ్మకమై ... మూఢ నమ్మకమై పెరగకముందే
ఇదొక వాదమై ....నవ్య సంప్రదాయవాదమై నర్తించక ముందే
ఈ శవమే ఒక సర్పమై బుసకొట్టక ముందే
ప్రచార కాలుష్యాల విషాన్ని ప్రసరించక ముందే
ఈ శవాన్ని శాశ్వతంగా దహనం చేద్దాం
దీని బూడిదను కూడా భద్రంగా సమాధి చేద్దాం —
రా నేస్తం !!
ఇవ్వాళ దీని దహనానికి నువ్వూ, నేనూ చాలు
మనం క్షణం విశ్రమిస్తే .... ఈ శవం విస్తరిస్తే
రేపు దీని దహనానికి
వంద 'నువ్వు'లూ, వంద 'నేను' లూ కావలసివస్తుంది
ఒక మహాయుద్ధాన్ని నడపాల్సి వస్తుంది —

— ఎసీ.

## సారా మరకల ఖాకీ అంగీ

—ఎం. డి. మునీర్



ఇంకో వారం రోజుల్లో కొత్త సంవత్సరపు సారా మామ్లా మొదలవుతుందనగా, మా పోలీసు కంట్రోల్ రూమ్ సర్కిల్ హడావిడి పడిపోతూ మా హెడ్డును కేకేసిండు. మా హెడ్డు కానిస్టేబల్ రామయ్య అసలే హడావిడి మనిషి. అందులోనూ పై అధికారుల ముందు ఎంతగా వినయ విధేయతలు ప్రదర్శిస్తాడో చెప్పలేం. ఇక ఆయన క్రింది కానిస్టేబుల్స్ మీద అంత హుకుం చెలాయిస్తడు. అసలు ఆ రోజు మా సర్కిల్ మొగిలయ్య చికాకుగా చిర్రుబుర్రులాడుతూ కనిపించిండు. ఆయన ఎప్పుడు ఏ మూడ్‌లో ఉంటాడో, అనుభవం మీద మేము ఇట్టే పోల్చుకోగలము. ఆయన జీబు చప్పుడు వినటంతోనే మేమంతా అలర్టు అయిపోయాము. మా కంట్రోల్ రూమ్ ముందు విశాలమైన ఆవరణలోకి జీబు వచ్చి ఆగింది. ఆయనకు ఎస్కార్ట్‌గా వున్న గన్‌మెన్స్ జీబునుండి క్రిందికి దిగక ముందే సర్కిల్ క్రిందికి దిగి ఆఫీసులోకి వచ్చిండు. వచ్చి రావటంతో హెడ్డు రామయ్యను పిలిచి ఏదో హుకుం జారీ చేసిండు. రంగేసిన గుబురు మీసాల రామయ్య అంతే హడావిడితో బయటికి వచ్చి "ఏయ్! ఫోర్‌నాట్‌టూ" అంటూ నన్ను పిలిచి, "మనవాళ్ళందర్నీ పిలిచి ఏదో ఎస్కార్టు డ్యూటీ ఉందట. అర్జంటుగా పోవాలి" అంటూ కేకేసిండు.

మేము పి. సి. ల మందరము ఒక లైనులో అటెన్షన్‌లో నిలబడ్డ తరువాత సర్కిల్ వచ్చిండు. ఒక్కసారి లైనులో నిలుచున్న వారికేసి చూసి, అందులో నుండి నలుగుర్ని ఏరి "మీరంతా ఈ రోజునుండి సారా జీబుకు ఎస్కార్టుగా పోవాలి" అని ఒకసారి మాకేసి పరీక్షగా చూసి, మానుండి ఏం బదులూ రాక ముందే "సమజయిందా ?" అంటూ హుంకరించిండు. ఆ నలుగురిలో నేను ఒకర్ని కావటం, ఆ రోజునుండి మాకు సారా జీబుకు ఎస్కార్టు పడటం జరిగిపోయింది.

దాంతో మా నలుగురి మొఖాల్లో నెత్తురు చుక్క లేకుండాపోయింది. సారా జీబుకు ఎస్కార్టు అంటే చావును కొని తెచ్చుకున్నట్టనే భావం మా అందరికీ ఒకేసారి కలిగింది. అందుకు కారణము లేకపోలేదు. ఈ కొత్త ఆబ్కారీ సంవత్సరము మొదలయినప్పటి నుండీ ఇటువంటి ఉపద్రవం ఏదో ముంచుకొస్తుం

దనీ, ఎవరికీ వారు పీంజీకొట్టుకున్నారు. ఆ ఉపద్రవము ఏదో రానే వచ్చింది. మెడకు పడ్డ పాము కరువక మానదన్నట్టు, పోలీసు డ్యూటీ అన్న తరువాత పై అధికారుల మాట ప్రకారము మెదలక తప్పదు.

మా గ్రూపులో నేను కాక ఇంక ముగ్గురున్నారు. అందులో నాకంటే వయసులో పెద్ద అయిన షరీఫ్, మీసాలులేని నెరిసిన గడ్డం నిమురుకుంటూ "క్యా కరింగే భై?" అంటూ వేలగా ప్రశ్నించిండు.

"ఇంక చేసేది ఏముంది?" అన్నాను నిరుత్సాహంగా.

"మొన్న ఏయస్పీసాబు వచ్చినప్పుడే అనుకున్నా, ఇటువంటిది ఏదో జరుగుతుందని. సారా బందు చేయాలని పిలుపు ఇచ్చిన అన్నలు బాగానే ఉన్నరు. ఇటు మన పై అధికారులు బాగానే ఉన్నరు. మధ్యలో మనకు చావు వచ్చి పడింది కదా?" అంటూ విచారంగా చెప్పుకొచ్చిండు.

మా హెడ్డు రామయ్య మళ్ళీ వచ్చి "ఏందీ ఇంకా బాతాఖానీ పెట్టుకుంటూ నిలుచున్నరు. కంట్రాక్టరు జీబు పంపిస్తున్నానని ఫోను చేసిండు. మీ తుపాకులు తీసుకొని రడీగా ఉండండి" అంటూ హెచ్చరిక చేసి వెళ్ళిండు.

మేము రడీ అయ్యేసరికి కంట్రాక్టరు జీబు రానే వచ్చింది మమ్మల్ని జీబులో ఎక్కించుకొని సారా గోదాం కాడికి తీసుకపోయిండు. నా పద్దెనిమిది సంవత్సరాల సర్వీసులో ఇటువంటి డ్యూటీ చేయడము ఇదే మొదటిసారి. అదంతా అదో లోకం. మాకు సహాయంగా మరో ఇద్దరు ఎక్సైజ్ కానిస్టేబుల్స్ జత అయిండ్లు. ఇకపోతే సారా అమ్మకాలు సాగించడం కోసం, ఈ సంవత్సరము సారా కంట్రాక్టు తీసుకున్న కంట్రాక్టరు మహారాష్ట్ర నుండి నలభై యాభయి మంది యువకులను తీసుకొచ్చిండ్రు. వారిలో ఎవరికి తెలుగు రాదు. ఇక్కడి పరిస్థితి తెలియదు. పని పాట లేక ఆవారాగా తిరిగేవారిని చిన్న చిన్న నేరాలు చేసి పోలీసు ఫైల్లోకి ఎక్కిన వారిని అక్కడి పోలీసుల సహాయంతో జమ చేసి తీసుకొచ్చిండ్రు. వాళ్ళందరికి తిండి తిప్పలు పోను రోజు యాభయి రూపాయల బత్తా ఇచ్చే ఖరారుమీద ఇక్కడికి పట్టుక వచ్చిండ్లు.

సారా అమ్మకాలు బందు చేయాలని అన్నలు ఇచ్చిన బందు పిలుపును ఎలాగయినా వమ్ము చేయాలని ప్రభుత్వము భారీ ఎత్తున సన్నద్ధమైందన్న సంగతి మాకు క్రమక్రమంగా అర్థం కావచ్చింది. ఈ పరిస్థితిని ఆసరాగా చేసుకొని ఓ ఎక్సైజ్ కమీషనర్‌గారు స్వయంగా బినామి పేరుమీద సారా కంట్రాక్టు చేజిక్కించుకోవడము జరిగిందనే విషయము బహిరంగ రహస్యమే. అయినా, అదేమంత ప్రాముఖ్యం లేని విషయంగా మారిపోయింది. అసలు ఈ సారా మామ్‌లాలోకి కమీషనర్‌గారు కాలు పెట్టడమన్నది గత సంవత్సరమే జరిగినా, అప్పుడా విషయం ఇంత బహిరంగము కాలేదు. ఇప్పుడు జిల్లా మొత్తాన్ని

కాంట్రాక్టు తీసుకున్న కమీషనర్ గారు, పోయిన సంవత్సరము మద్య నిషేదము అమల్లో ఉన్న కోల్ బెల్టు ప్రాంతములో, సారా మామ్‌లా మొదలయిన ఐదు నెలలకు ప్రభుత్వము ఇచ్చిన ఎనభై శాతము సబ్సిడీని ఉపయోగించుకొని బినామి పేరు మీద సారా కంట్రాక్టు తీసుకొని ఆ సంవత్సరంలో ఎనభై లక్షలు సంపాదించిండు. లానాదేనా అన్ని ఖర్చులు పోను అంత మొత్తం మిగిలేసరికి, మనిషి మాంసానికి రుచి మరిగిన పులి ఊరికే ఊరుకోదన్నట్టు, ఈ సంవత్సరం జిల్లా మొత్తాన్ని తను దక్కించుకున్నడు. అంతకు ముందున్న సారా కంట్రాక్టర్లందరు, అన్నలకు భయపడి పాటలు పాడకుండా పోవడంతో కమీషనరుగారి రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు అయింది. అంతేకాకుంటా తన చేతికి మట్టి అంటకుంటా చక్రం ఎలా తిప్పుకు రావాలో, ఆ ఎక్సయిజ్ కమీషనరుగారికి బాగా తెలుసనే విషయం మాకు అనుభవంతో తెలిసి వచ్చింది. దానికితోడు పై లెవల్లో సి.యం దాక అతనికి ఇన్‌ఫ్లూయెన్స్ ఉన్నదని, అతను తలుచుకుంటే ఏమన్నా చేయగలడని, ఇంకా అటువంటివే చాల విషయాలు అతని గురించి తెలిసి వచ్చాయి. ఏదయితేనేం సారా అమ్మకాలు సజావుగానే సాగుతున్నాయి.

పొద్దున్నే స్టేషనుకు పోవడం అక్కడి నుండి సారా కాంట్రాక్టరు జీబులో సారా గోదాంకు పోవడం, తిర్గి ఉదయం ఎనిమిది తొమ్మిది గంటలకల్లా లారీ నిండా సారా క్యానులు నింపుకొని పోలీసు స్టేషను కాడికి రావడము సాయంత్రం ఐదు గంటల వరకు సారా అమ్మకాలు సాగించి, సారా లారీకి ఎస్కార్టుగా పోయి గోదాంకాడ అప్పజెప్పడం మాకు రోజువారి దినచర్య అయిపోయింది.

సారా లారీ స్టేషను కాడికి రాకముందే తాగుబోతులు పోలీసు స్టేషన్ల ముందు బారులు తీరి నిలుసోవడం ఇదే అదనుగా భావించి చిల్లర మల్లరగా అమ్మేవారు సంచుల్లో క్యాన్లలో ఒక్కసారి వంద రెండు వందలు ఖరీదు చేసుకొని పోయి వాడల్లో చిల్లర మల్లర అమ్మడం అంతా మామూలు అయిపోయింది. "ఇదివరలో అయితే ఎవడన్నా దొంగతనంగా సారా అమ్మితే వాన్ని మక్కెలిర్గ బొడిచేవోల్లం. కాని ఇప్పుడదంతా ఏమీలేదు. ఎంత మంది దొంగతనంగా సారా అమ్మేవాళ్ళుంటే అంత మంచిదని అనుకుంటాండ్లు" అన్నాడు. ఎక్సయిజ్ కానిస్టేబుల్ ఒకడు. ప్రతిరోజు గంటల తరబడి కలిగి ఉండటమువల్ల మాకు అనుకున్న దానికంటే ఎక్కువే చనువు ఏర్పడింది. మాతో పాటు ఎస్కార్టు డ్యూటీలో ఉన్న ఇద్దరు ఎక్సయిజ్ కానిస్టేబులో ఒకడు కాస్త వయసు మళ్ళినవాడు, మరొకతను యువకుడు.

"ఇదివరకైతే ఊళ్ళకు ఎక్సయిజ్ వాళ్ల జీబు వచ్చిందంటే దొంగ సారా కాసే వాళ్ళకు గుండెల్లో రైల్లు పరిగెత్తేవి. ఇప్పుడదేమి లేదు. ఎక్సయిజ్ జీబు వస్తుందంటే జనం చుట్టు గుమి

కూడి సారా బస్తాలు తెచ్చేంస్లా అని అడిగువాండ్లు. అప్పుడైతే చిన్న పెద్ద అనకుంటా మాకు ఇంతో అంతో మామూళ్ళు ముట్టేవి. ఇప్పుడు మామూళ్ళ సంగతి ప్రక్కన పెట్టు, గీడీ డబ్బులు కూడా గిట్టుబాటయితలేదు. పెద్ద పెద్దోళ్ళంతా కుమ్మక్కయి అధికారులే ఉండి నడిపిస్తుంటే మాదాక ఏం వస్తుంది. గుడిని, గుడి లింగాన్ని వాళ్ళే మింగేస్తున్నరు" అంటూ తన అనుభవాన్ని చెప్పుకొచ్చిండు వయస్సులో కాస్త పెద్దవాడైన ఎక్సయిజ్ కానిస్టేబుల్.

కుర్ర ఎక్సయిజ్ కానిస్టేబుల్ నిజమేనన్నట్లుగా తలాడించి "మాకు అప్పుడు ఏప్రారికి పోయిన సారా కాంట్రాక్టర్లు జబర్దస్తే ఇంతజాం చేసేటోల్లు నాస పీనా జోర్ గుండేది. ఇప్పుడేమో జీవం రాల్లు ఎట్టి చాకిరీ తప్ప మిగేమి లేదు" అంటూ విచారం వ్యక్తపరిచిండు.

కాకి బట్టలేసుకున్నోడంతా కుడి ఎడమల తేడాలున్నా అంత ఒక్క తీరుగానే ఉన్నట్లుగా వాళ్ళ మాటలను బట్టి నాకు అనిపించింది. అంతెందుకు మా బతుకులు కూడా అట్లాగే ఉన్నాయి.

మామూళ్లన్ని పై అధికారులకు, తిట్లు, రాత్రి పగలనక డ్యూటీలు, అడప దడపా ఏదన్న కక్కుర్తిపడి పరిగె ఏరుకున్నట్టు ఎక్కడన్నా పావలో, పరోక్క తీసుకుంటే వాళ్ళంతా నిజాయితీపరులైనట్టు మెమోలు, పనిష్మెంట్లు పై అధికారులంతా ఊరిమీద పడి పెద్దపులి తీరుగ తినుకుంటా పోతుంటె, మేమేమో గుంటకాడి నక్కలాగా చీకేసిన బొక్కల కోసం కాచుక కూసుండాలి. చావులకు తన్నుల గుద్దులకు మేమేమో ముందుండాలి తేరగా తినేకాన్కొచ్చె వాళ్ళు ముందుంటరు. ఇదంతా పై అధికారులకు తెలిసినా తెలియనట్టుంటారు. లేకుంటే స్టేషన్ మేంటినెన్స్ కోసం ప్రభుత్వం ఇచ్చే అరాకొర ఖర్చులు ఏ మూలకు సరిపోతయి. అయినా ఎవరి వాటా వారికి పోతున్నప్పుడు. పై అధికారులు మాత్రం ఎందుకు కిమ్మనకుంటా ఉండరు.

సారా అమ్మేకాడ ఏదో గడబిడ అవటంతోని మా సంభాషణ, నా ఆలోచనలు తెగిపోయాయి. మేమంతా అలర్టు అయిపోయి ముందుకు ఉరికాము. అంత వరదాక మేము పోలీసు స్టేషను గోడకు ఆనుకొని, చింత చెట్టు కిందో అక్కడికి ఓ పది గజాల దూరంలో నిలుచున్నాం.

మేం పోయేసరికి మాకు అగుపించిన దృశ్యం మాసిపోయి చిరుగులు పట్టిన అంగి, సారా తాగి ముఖం ఉబ్బి పోయిన మనిషి సారా ప్యాకెట్లు అమ్మే కుర్రవాడితో ఘర్షణ పడుతున్నాడు.

ఏమైంది ఏమైంది అంటూ మా కానిస్టేబుల్ ఒకడు ప్రశ్నించాడు.

అందుకు బదులుగా సారా అమ్ముతున్నవాడు తన మాట ముందొక బూతు మాటవాడి, ఆ తరువాత "నాలుగు రూపాయల ప్యాకెట్ వీనికి మూడున్నరకే ఇవ్వాలనట, చల్ పోనే అంటే కదులుతలేడు" అంటూ చెప్పుకొచ్చిండు. మా జవాన్ అల్లరి చేస్తున్న వాడికాలరు

పట్టుకొని లైనునుండి ఈవలికి గుంజిండు. ఆ వూపుతో వాడు ఒక్క- సారిగా నేలమీద పడ్డడు. నేలమీద పడ్డోడు అమానంగా వణుకుతు లేచి రెండు చేతులు జోడించి అయ్యా నీకాల్లు మొక్కుతా ఈ పైసలు తీసుకొని ఒక్క- సారా ఇత్త ఇప్పియండ్లి. ప్రాణం పీక్క- బోతుంది” అంటు ఎండిపోయిన చేతు లను చాపి పైసలు చూయించిండు. మేమున్నామన్న ధైర్యంతోనో ఏమో సారా అమ్మే షరో యువకుడు అదేదో వింత జరిగినట్టు పక పక నవ్వి, ఒక ఉదుటున కుడి కాలుతో వాడి చేతిమీద తన్నిండు. వాని చేతిలోని చిల్లర డబ్బులు ఎగిరి పడ్డయి. దాంతో ఆ తాగు బోతు తన ప్రాణమంతా ఆ చిల్లరడబ్బు ల్లోనే ఉన్నట్టు, అదికాస్త గాలిలో ఎగిరి పోయినట్టు విలవిల్లాడుతూ, వణికే చేతు లతో క్రింద పడ్డ డబ్బులను ఎరుకో సాగిండు. వాని అవస్థ చూసి మావోల్లు పక పక నవ్వుతండ్లు.

అతన్ని చూస్తుంటే ఎందుకో నా కడుపులో ఎవరో చెయ్యి పెట్టి దేవినట్ట యింది. చప్పున మా అన్న గుర్తు కొచ్చిండు. మా నాన్న వండ్లపని చేసే వాడు. నాకంటే పెద్దవాడయిన మాఅన్న మా నాన్నకు సహాయంగా వండ్ల పనిలో ఉండిపోయి చివరికి అదే జీవనోపాదిగా చేసుకున్నడు. నేను పదో తరగతి చదువుకున్న తరువాత, వడ్రంగి పనిలో ఏం లాభం లేదనుకొని పోలీసుల బర్తీ అయిపోయిన. మొదట్లో మా అన్న పొద్దంత పనిచేసి, చేసిన కష్టం మరిచి పోయేందుకు అడపా దడపా మందు కొట్టేవోడు. క్రమంగా అది అలవాటుగా మారిపోయింది. అప్పటికే ముగ్గురు పిల్లలు కల్గిండ్లు. కుటుంబ భారము పెరిగిపోయింది. షోరూమ్ వారి పోటీ మూలకంగా చిల్లర మల్లర పనుల చేసేవారికి రోజు పని ఉండేదికాదు. దొరికిననాడు పని దొరికేది లేని నాడు లేకుంటాపోయేది. ఏదీ ఉన్నా లేకున్నా తాగుడు మాత్రం తప్పేదికాదు. తాగి తాగి చివరికి అతని శరీరము మొద్దుపనికి సహకరించేదికాదు. అదితప్ప మరో బ్రతుకుతెరువు లేకపోవడంతో సచ్చి చెడి అదే పని చేయవలసి వచ్చేది. దాంతో ముప్పయి ఆరు ఏండ్లకే మనిషి బొక్కలెల్లి, తెల్లబడి పోయిండు. అగ్గో అదే సమయంలో బీమారిల పడ్డడు. మొదట అంత శ్రద్ధచేయలే. తీరా ముది రిన తరువాత గవర్నమెంటు హాస్పి టల్‌కు పోతే లివర్ ఖరాబు అయింది అని హాస్పటల్ల జాయిన్ చేసిండ్లు. మా వదిన చాల మంచిది. కాని ఏం చేస్తది. పని చేసినప్పుడే అంతంత మాత్రంగా సాగే సంసారం పనిలేక రోగాల పడ్డ ప్పుడు ఎంత బాదయితదో అనుభవిస్తే కాని తెలువదు. అయినా మా వదిన ధైర్యం చెడలేదు. అప్పో సొప్పో చేసి మా అన్నను బ్రతికించు కోవాలని చూసింది. హాస్పటల్లో ఉన్నప్పుడే మా అన్న మా వదిన పడుకున్న తరువాత కొంగుకున్న ఇరవైరూపాయలు విడిపించు కొని పోయి, గవర్నమెంటు హాస్టటల్ ప్రక్కనే ఉన్న ప్రభుత్వ సారా దుకాణ

ములో ఎకాఎకిన ఐదు బస్తాలు తాగి సోయి తప్పిపోయి, అక్కడ్నే పడి సచ్చిండు....

అదంతా గుర్తు కొచ్చి ఎక్కడ లేని క్రోపం కల్గింది.

చెల్లా చెదురైన చిల్లరడబ్బులను ఏరు కుంటు ఆ తాగుబోతు భయంతో వణుకు తున్నాడు. నల్ల అంగి వేసుకున్న సారా అమ్మేవాడు గేలిచేస్తు, పకపక నవ్వు కుంటు మరో తన్ను తన్నటానికి సిద్ధ మయిండు. మరో పోలీసు జవాను ఇక ఆ తాగుబోతుతో అంత ప్రమాదంలేదను కొని తుపాకిని భుజంమీద పెట్టుకొని నిర్లక్ష్యంగా చోద్యం చూస్తున్నాడు. ఆ లొల్లికి సారా కోసం వచ్చినవారు కాసంతసేపు చెల్లాచెదురై మరేమీ భయం లేదనుకొని సారా క్యాన్ల చుట్టూ మరోసారి ఎగబడ్డారు. కింద పడ్డ చిల్లర డబ్బులు ఏరుకొని ఆ తాగుబోతు మరో సారి రెండు చేతులు జోడించి ఒక్క సారా ప్యాకెట్ ఇప్పియి" అంటు హీన ముగా దీనంగా మరోసారి ప్రతిమిలాడు తున్నాడు.

"ఈ లంజ కొడుకును ఎత్తి బయట కుదేయిండ్లి" అంటు ఇందాకటి పోలీసు జవాను అసహనంగా అరిచిండు. తుమ్మ మొద్దులాంటి సారా అమ్మే యువకుడు, మోకాల్ల మీద కూచున్న ఆ తాగుబోతు జుట్టును పిడికిట బట్టి ఒక్కసారిగాగుంజి ఇవతలకి తోసిండు. ఆ విసురుకు మరో సారి పడిపోయిండా తాగుబోతు.

నా కడుపులో ఎవరో చెయ్యిపెట్టిదేవి నట్టయింది. ఇక నేను తమాయించుకో లేకపోయిన "ఆగుండ్లి" అంటు పెద్దగా అరిచాను. ఆ అరుపుకు అందరు ఒక్క సారిగా నా కేసి చూసిండ్లు. నాకు అదేమీ గుర్తుకు రావటంలేదు. తాగుడుకు అల వాటయిపోయిన నరాలన్ని జివ్వుమం టుంటే ప్యాకెట్ సారాకోసం విలవిల్లాడు తున్న ఆ తాగుబోతు నాకు అచ్చం మా అన్నలాగే కనిపించిండు. నేను రివ్వున పోయి తాగుబోతు జుట్టు పట్టుకున్నవాన్ని విసురుగా తోసేసాను. ఈ హఠాత్తుసంఘ టనకు వాడు ఏ సంగతి అర్థంకాక బీరి పోయిండు. "వానికో సారా బత్తా ఇయిండ్లి" అంటు గట్టిగా అరిచాను.

ఒక్క క్షణం సారా క్యాను ముందు కూచున్నవాడు ఎటు పాలుపోక చేతలుడిగి పోయి నిలువుగుడ్లేసుకొని బీరిపోయిండు. బిరబిర వాని ముందుకేగి సారా క్యాను నుండి దోసిటికి అందినన్ని సారా ప్యాకట్లు తీసి తాగుబోతు చేతిలో పోసి "పో! కడుపు నిండా తాగుపో" అంటు గదమాయించాను. వాడొక క్షణం ఎటు అర్థంకాక స్థాణువులా అయిపోయి, మరు క్షణంలో దోసిటిలోని సారా ప్యాకెట్లను పట్టుకొని అపేక్షణగా వాటికేసి చూస్తూ, మళ్ళి మళ్ళి మొక్కుకుంటు వణుక్కుంటూ వణుక్కుంటూ లేచిపోయిండు.

"క్యా హై క్యాయే" అంటు నా తోటి కానిస్టేబుల్ ఏదీ అర్థంకాక అయోమయ ముగా మొఖం పెట్టిండు.

"కుచ్ నహీం .... ఆ డబ్బులు నేను ఇస్తాను వాన్ని పోనియిండ్లి" అన్నాను.

"ఏమైందన్నా.. ఎందుకిలా చేసావు"

మరో జవాను ఆర్ద్రతతో ప్రశ్నించిండు.

నాకు మాట పెకలలేదు. నా కండ్ల పొంటి నీళ్ళు ఉబికినాయి. నా శక్తిఅంత అరింపుకు పోయినట్లుగా నీరసం ఆవహించుకు పోయింది.

ఆ రోజంతా నా మనసేమీ బాగుండ లేదు. నన్ను ఎందుకిలా ప్రవర్తించావని అడిగిన నా తోటి జవాన్లకు ఏమి సమాధానం చెప్పకుండా దాటవేసాను. ఆరోజు ఇంటికి వచ్చిన తరువాత కూడా ఆ తాగుబోతు మొఖమే పదేపదే గుర్తుకొచ్చి ఒక్క మెతుకు కూడా కడుపులకు పోలేదు. ఆ రాత్రి పిచ్చి పిచ్చి ఆలోచనలతో చాలసేపటిదాక నిదురు కూడా రాలేదు. నా పోలీసు జీవితంలో నేను చాలమంది కేడీ గాండ్లను, ముందు తియ్యటి మాటలు చెప్పి వెనుక గోతులు తీసే రాజకీయ నాయకులను .... క్రింది వాళ్ళమీద చిన్నచిన్న కారణాలకే పెద్దగా చిర్రుబుర్రులాడుతు పెత్తనంచేసే అధికారులు పై అధికారుల ముందు పిల్లిలా నరిగి నంగి మాట్లాడే మాటలు విన్నా, లంగలను చూసాను, లవంగిలను చూసాను. దొంగలను చూసాను. కాని గుక్కెడు సారా కోసం విలవిల్లాడేవాన్ని చూల్లేదు.... మా అన్న చనిపోకముందు అటువంటి వాన్ని చూసి కూడా గుర్తుపట్టలేదేమో కాని మా అన్న చనిపోయిన తరువాత అటువంటివాన్ని చూడటం అదే మొదటిసారి.

ఆ సంఘటన జరిగిన రెండవనాడు కూడా నేను డ్యూటికిపోలేదు. ఆరోజంతా పిచ్చిలేసిన కుక్కతీరుగా ఎక్కడెక్కడో తిరిగాను. ఆ మనిషుడు కాని మనిషిని కానలేకపోయిన.

మళ్ళీ ఎప్పటిలా మామూలు మనిషిని అయిపోయి యథావిధిగా డ్యూటీలకు హాజరు అవుతుండగానే ఒకరోజున నేను డ్యూటి నుండి కాస్త పొద్దుపోయిన తరువాత ఇంటికి వచ్చాను. సాయంత్రము ఎనిమిది గంటలకే చలికాలము కావటము వలన ఊరంత సద్దు మణిగింది.

నేను ఇంట్లోకి అడుగుపెట్టే సరికి, మా అక్క బావ కనిపించిండ్లు. నాకు వారికి చూడటముతోనే సంతోషమనిపించింది. మా బావకు చిన్న సైకిల్ షాపున్నది. ఎవరి అంటు సొంటు లేకుంటా తన బ్రతుకేదో తాను బ్రతికే రకం బాపతు. మా అక్కకు ముగ్గురు పిల్లలు. ఇద్దరు ఆడపిల్లల తరువాత ఒక అబ్బాయి. ఇద్దరు ఆడపిల్లల పెండ్లి ఆరు నెలల క్రింద ఒక్కసారే చేసిండ్లు. మా అక్కవాళ్ళు ఉండేది పక్కఊరే అయినా పెండ్లికి పోయిన కాన్నుంచి మళ్ళీ వాళ్ళ ఊరుకు పోలేదు. ఎవరిపనిలో వారుండి పోయి తీరుబాటు లేకుంటా పోయింది తప్ప మరే కారణం లేదు. అటువంటిది ఒక్కసారే మా అక్క, బావ కలిసి రావటం చూసి నాకు సంతోషంకల్గింది.

"ఎప్పుడొచ్చిండ్లు" అంటు పలకరింపుగా అడిగాను. నా మాటకు మా బావ నేల చూపు లేసుకొని ముభావంగా "అప్పుడే అచ్చినం" అన్నడు తల ఎత్త కుండానే. అంతలోనే ఉన్న పలంగా మా అక్క ఎదురొచ్చి నామీద పడి

ఏడవడము మొదలుపెట్టింది. నాకు ఏ సంగతి అర్థంకాక అయోమయంలో పడి పోయి "ఏమైంది" అంటు ఓదార్చ సాగాను. ఏ మాటాపలుకూ లేకుండా దమ్మతీర ఏడ్చిన తరువాత, అసలు సంగతి చెప్పుకొచ్చింది. అప్పుడు నాకు అర్థమయింది.

నా మ్యాన అల్లుని పోలీసులు పట్టుక పోయిండ్లని, ఆ మధ్యన వాళ్ళ ఊళ్ళో ఎవరో దొంగతనంగా సారా అమ్ముతున్నరని వాని ఇంటి మీద రాడికల్స్ దాడిచేసి, ఇంటి వాన్ని కొట్టి నాలుగు వందల సారా ప్యాకెట్లు దగ్దం చేసిన కేసులో మా అలుడు కూడా ఉన్నాడనే అనుమానంమీద పోలీసులు మొన్నరాత్రి వచ్చి పట్టుక పోయిండ్లని తెలిసింది

ఆ సంగతి వినేసరికి ఒక్కసారిగా నా గుండెలో రాయి పడ్డట్టు అయింది. క్షణం సేపటిదాక నాకు ఎటు తోచలేదు.

"మొన్న రాత్రి సివిల్ డ్రెస్‌లో పోలీసులు వచ్చి పట్టుక పోయిన తరువాత ఎటు తీసుక పోయిండ్లో ఏమోనని నిన్నంతా అన్ని స్టేషన్లు తిరిగినము. మాకు తెల్వదంటే మాకు తెల్వదని స్టేషన్ల చెప్పుకొచ్చిండ్లు తీరాచూస్తే మీ కంట్రోల్ రూమ్ పోలీసులే వచ్చి తీస్కపోయిండ్లని తెలిసింది. ఎనక ముందు చూస్తే ఏ ప్రమాదము ముంచుకొస్తదేమోనని ఇటు ఉరికి వచ్చినము. నాకు ఎట్లు సమజయిత లేదు. పోరడు చదువు పూర్తిచేసుకుంటే ఓ దారి కొస్తడని అనుకున్నాగాని వాడు గిట్ల చేస్తడనుకోలేదు" అంటు మా బావ బాధతో చెప్పుకొచ్చింది.

"మా వోళ్ళే తీసుకొచ్చిండ్లని సచ్చితంగా ఎలాతెలుసు" అంటు ఆరాతీసాను.

"సెక్టోని పనిచేసే సాంబయ్య నన్ను గుర్తుపట్టి చెప్పిండు"

"అయితే నిజమేనన్నమాట .... పెద్ద తిరకాసు వచ్చి పడుంది రాడికల్ కేసులంటే ఇయ్యాల రేప్ర అధికారులు ఎవ్వని మాట ఇంటలేరు. అవసరమైతే ఎంతకైనా తెగించి పేస్తున్నరు."

"నువ్వేగిట్లంటే ఎట్లా మరి"

"అదికాదు బావ .... పైనుంచి ప్రెషర్ బాగున్నది. ఎవనిమీద అనుమానం వచ్చినా బొక్కలేసి, ఎముకల సున్నం లేకుండా ఏరీస్తాండ్లు పుల్ పవర్ ఇచ్చిండ్లు .... సోవాడు నావోడు అంట లేరు. అంతా ఆగం ఆగంగా ఉంది పరిస్థితి నరే నేను తెలుసుకుంటా మా సర్కిల్ ఇం....కొడుకు మంచోడు కాదు .... అందుకే జుట్టు, అందకుంటె కాళ్ళు పట్టుకుంటడు. ఇక వాని క్రింద పనిచేసే టాల్లన్న ఇమానం కూడా ఉండదు." అంటు స్టేషను కాడి సంగతులు చెప్పుకొచ్చిన, నా మాటలేవి మా బావ చెవిన పోకినట్టులేవు. "ఈ రాత్రికే పోయి ఏ సంగతి తెలుసుకొని రమ్మంటడు. కాని ఈ రాత్రికి పోతే సర్కిల్ కలవడు. ఇప్పటికే ఎవని కాడనో సీకలదాక తాగుతుంటడు. పొద్దున్నే పోయి ఏ సంగతి తెలుసుకుంటానని మా అక్క, బావని సముదాయించాను.

మరునాడు స్టేషనుకు పోయి సర్కిలును కలిసాను. ఆయన చిర్రున కోపంతో ఇంతెంతు లేచి "వాడు నీకు మ్యాన అల్లుడా ? వాన్ని వదిలెయ్యాలని సిఫారసు చెయ్యటానికి వచ్చినవా ? సిగ్గులేదు. వాడు మషూర్ రాడికల్. వాన్ని ఇన్నిరోజులు నీ పంచన పెట్టుకొని డ్రామాలు చేస్తున్నందుకు వానితో పాటు ముందుగా నిన్ను బొక్కలో తోయాలి" అంటూ చిర్రున కోపంతో లేచిండు.

"అదికాదు సారు" అంటూ ఇంకా నేను ఏదో చెప్పబోతుంటే నా మాట పూర్తికాకుండానే "ఐ డోంట్ వాంట్ ఎనీ ఎక్స్ప్లనేషను, ఇంకో మాట మాట్లాడితే వానితో పాటు నిన్ను లాకప్లో వేస్తాను. గేట్ అవుట్" అంటు పెద్దగా అరిచిండు. ఆ అరుపులకు స్టేషన్లోని మిగతా జవానులంతా చెవులు రిక్కించిండ్రు.

ఇక నేను అక్కడ ఉండలేక బయటికి వచ్చేసాను. నా మనసంతా మొద్దుబారిపోయింది. నా ఇన్ని సంవత్సరాల సర్వీసులో ఇంత అవమానం ఎప్పుడు జరుగలేదు. ఎంతో పెద్ద పెద్ద కేసుల్లో వేలకు వేలు లంచాలు మింగి మాఫీ చేయించిన సంగతి నాకు తెలియందికాదు అటువంటి ఒక డెకాయిటీ కేసులో ప్రాణాలకు తెగించి పారిపోతున్న డెకాయిటిని పట్టుకుంటే ఆ మరునాడు స్థానిక అధికార పార్టీ నాయకుని సిఫారసుతో పద్నాల్గువేలు లంచంగా మింగి ఎఫ్.ఐ.ఆర్. కూడా రాయకుండా కేసును మాఫీ చేయగా లేనిది, ఇప్పుడే నీతి నియమాలు అడ్డువచ్చినవా ? అంతా దొంగ నాటకము.

"ఇంటరాగేషన్లో మీ వాని దేమి పెద్దగా పాత్ర లేదని తేలింది. అయితేనేం ఆ సంఘటన జరిగినందుకు ఏదో ఒక కేసు ఫైల్ చేయాలని చూస్తాండ్రు" అంటు సాయబలి ఓదార్పుగా చెప్పుకొచ్చిండు.

నా మనసంతా కుత కుతలాడి పోతుంది. "అది కాదన్నా మా వాడు తెలిసో తెలియక ఒక పారు చేసిండు. వాన్ని ఇక అటువంటి వాటి జోలికి పోకుండా చూసుకుంటానంటే ఇన్నేండ్లుగా ఈ స్టేషన్లో పనిచేస్తున్న గుమానం అన్నా లేకుండా ఎట్లా మాట్లాడుతున్నడో సూడు."

"అదంతెనన్నా .... నీకు తెల్వంది ఏంది .. మనం ఈ స్టేషన్ల పనిచేస్తున్నం కాకిబట్టలు వేసుకున్న మనకేందని మనం విర్రవీగుతుం. వాళ్ళు చెప్పిన అడ్డమైన పనులల్లో మారు మాట్లాడకుండా చేస్తం, కాని అవసరము వచ్చినప్పుడు మనమెంతటోల్లమో అర్థంకాదు. రేపోమాపో కేసు ఫైలు చేస్తరు. కేసు అయిన తరువాత ఎంత పీకులాట ఉంటదో నీకు తెల్వదా ? కొత్తగా వచ్చినోడల్లా పాత కేసుల్లో ఉన్నోల్లందర్ని, మళ్ళీ ఎక్కడ ఏం జరిగినా ఇరికించి నానా ఇబ్బందులు పెడ్తరు. ఒక సారి చిట్టాలో ఎక్కిన తరువాత ఈ రంపాటకము ఒక్క రోజుతో ముగిసిపోదు. అందుకే ఏదో ఒకటి చేసి కేసు కాకుండానే మనోడు

బయటపడే ఉపాయం ఆలోచించు." అంటూ ఓదార్పుగా చెప్పుకొచ్చిండు.

నాకు నిజమే అనిపించింది. అటు వంటి ఎన్ని కేసులు తాను చూడటము లేదు. తెలిసో తెలియకో ఎవడన్నా ఒక్కసారి కేసులో ఇరుక్కుంటే, వాడికి పోలీసు సాలెగూడులో చిక్కుకున్న ఈగల్లా గిలగిల లాడవలసిందే తప్ప బయటపడే మార్గంలేదు. ఒకవేళ బయట పడ్డా బ్రతకనియ్యరు.

"మరైతే ఏం చెయ్యమంటవు"·

"నీకు తెల్వదా అన్నా, మన ఊళ్ళె ఉన్న అధికారపార్టీ లీడరు ప్రసాదును పట్టుకో. వానికి అంతో ఇంతో ముట్ట చెప్పితే ఎటువంటి కేసయినా మాఫీ అయి పోతది. వానికి మన సర్కిల్ గానికి మంచి దోస్తానా ఉన్నది. నీకు తెలవని సంగతా ! వాని మాట తీసెయ్యడు. ఎనక ముందు చూడకుండా వాన్ని పోయి కలువు...." సాయబలి సగం నెరిసిన గడ్డంలోకి చేయి దోపుకొని బరాబరా గోక్కుంటు సలహా ఇచ్చిండు.

ఇక నాకు వేరే మార్గం కనిపించ లేదు.···· సాయబలీ చెప్పిందే సరైన మార్గంగా కనిపించింది. సర్కిల్ పైసన్నా, పవరన్నా పడి చస్తడనే విషయం అనుభవం మీద ఎరిగి ఉన్న విషయమే.

"సరే అన్నా నీవు చెప్పిందే సబ బుగా ఉంది," అని చెప్పి స్టేషన్ నుండి బయటపడి ఇంటికి వచ్చాను.

నేను వచ్చేది చూసి, మాఅక్క బావ నాకు ఎదురొచ్చి 'ఎమైంది? మీ సర్కిల్ విడిచి పెడుతానన్నడా !" అంటు ఆత్రంగా అడిగిండు.

"బావా బండక్రింద మన చెయ్యి ఇరి కింది. దాన్ని ఒడుపుగా బయటికి తీసు కోవాలి. ఉత్త మాటలకు చింతకాయలు రాలతట్టులేవు ... మా అల్లుడని చెప్పి ఎంత బ్రతిమిలాడినా ఆ లం....కొడుకు చెవిమీద ఈగ వాలుతలేదు. ఇట్లని చెప్పి గాల్లో దీపం పెట్టి చూస్తుండలేము కదా! మనోడు తెలిసో తెలియక ఓ పొరపాటు చేసిండు. వాన్ని ఎట్లన్న చేసి కేసు కాకుండా బయటికి తీయాలి. ఆ పని నా వల్ల అయేట్టులేదు. అట్లనీ మనం ఊకో రాదు. మా సర్కిల్‌కి ప్రసాద్ అనే లీడ రుకు దోస్తాని ఉంది. ముందు వాని చేతులు తడపాలి · అటు తరువాత దాని పని అదే అయితది".

"ఇంతకు నువునేది ఎందీ ?"

"పైసలుతోని పని"

"ఎంతయితది"

"కనీసం ఐదువేలన్నా కావాలి అంతకు తక్కువైతే వాడసలు కేసు పట్టడు" అన్నాను.

మా బావకు మాటలు రాక బేలగా మొఖం పెట్టిండు. మా అక్క తిరిగి ఏడుపు మొదలు పెట్టింది. ఉండి ఉండి మా బావ అన్నడు....

"మొన్ననే ఇద్దరు ఆడపిల్లల పెండ్లీలు చేసే ఇల్లంతా గుల్లయిపో యింది. పెండ్లికి చేసిన పద్దెనెనిమిదివేల అప్పుకు వడ్డీలు కట్టలేక చస్తున్న.... ఉన్నపలంగా ఐదువేలు కావాలంటే ఎక్కడి నుంచి తేవాల" అంటు గుడ్ల నీళ్ళు కుక్కుకున్నడు.

మా అక్క ఏడుపాపి, "ఎట్లన్నా చేసి నా కొడుకును బయటికి తీసుకరావాలి... లేకుంటే నేను బతుక" అంటు బిగ్గరగా ఏడ్వసాగింది. దాన్ని వోదార్చడం ఎవరి తరం కాలేదు.

చివరి పరిష్కారంగా మా అక్క మెళ్ళో వున్న నల్లపూసల గొలుసును అమ్మాలని నిర్ణయించుకోవడం జరిగింది. ఆడ పిల్లల పెండ్లికి అయిన ఖర్చులకు మా బావ సంపాదించి పోను.... మా అక్క ఒంటి మీదున్న నగలమ్మింది కాని ఒక్క నల్ల పూసల గొలుసు అమ్మ టానికి అది సుతారాం ఇష్టపడలేదు. అది ఈ విధంగా కరిగిపోయింది.

గొలుసు అమ్మగా నాలుగుపేలు వచ్చి నవి. ఇంకో వెయ్యి అప్పు, గిరి గిరి నడిపే వాని దగ్గర తెచ్చుకొని మొత్తాని కై తే ఐదుపేలు జమచేసిపోయి లీడరును కలసిండు మా బావ. నేను పోతె లీడరు మొహమాట పడి ఎక్కడ కాదంటాడో నని వాని ఇంటి గేటు బయటనే నేను ఉండి పోతే మా బావ ఒక్కడే లోనికి పోయిండు.

పది సంవత్సరాల క్రింద ఈ లీడరు గురించి ఎవనికి తెలియదు.... ఎట్లా ఎది గిండో కాని ఈ పది సం॥రాలలో స్టేట్ లెవల్ దాక ఎదిగిండు అరవై డెబ్బయి లక్షలు సంపాదించిండు. ఇంద్ర భవనం లాంటి ఇల్లు కట్టిండు. దాని చుట్టు నిలు వెత్తు ప్రహరి గోడ దాని ముందొక పెద్ద ఇనుప గేటు బయటే మా బావ కోసం ఎదురు చూస్తుండిపోయాను.

కొద్దిసేపయిన తరువాత మా బావ బయటికి వచ్చిండు "ఏమన్నడు" అంటూ అడిగాను.

"అనేదేంది.... ఈ ఐదుపేలతోని పనికాదని కరాఖండిగా చెప్పుకొచ్చిండు. చివరకు కాళ్ళా వెళ్ళా బ్రతిమిలాడితే.... పని అయిపోయిన తరువాత మరో రెండు వేలు ఇవ్వాలన్నాడు .... ఎట్లయితేంది ముందు పని కావాలని సరే అన్నా" అంటు చెప్పుకొచ్చిండు ...

ఆ మరునాడు నేను మళ్ళీ స్టేషనుకు పోయాను. నన్ను చూసి సర్కిల్ "ఎయ్ వెంకటస్వామి ఇటురా" అంటు పేరుపెట్టి పిలిసిండు. నాకు విచిత్రం అనిపించింది. యాంత్రికంగా ఆయన ముందుకు పోయి నిలుచున్నాను. అల వాటు ప్రకారము సెల్యూట్ చేయలన్నా జ్ఞానము కూడా నాకు అప్పుడు లేకుండా పోయింది.

మా సర్కిల్ గుండ్రటి బలిసిన మొఖంలో మూసుకపోయిన చిన్న కండ్లలో దొంగ నవ్వు మెదలింది. అది చూస్తుంటే నర మాంసము రుచి మరిగిన పెద్ద పులి కండ్లలా అనిపించినయి.

"ఇదిగో నువ్వు నిన్న కలిసి చెప్పిన నా నుంచి నేను ఆలోచన చేస్తునేఉన్నా! అప్పుడేదో కోపంలో ఉండి ఏదోమాట్లా డినా! కాని ఎంతయినా నీవు చాల ఏండ్ల కానుంచి మన స్టేషన్లో పని చేస్తున్నవు. తెలిసో తెలియకో మీ వోడు కాని పని చేసిండు. నీ మాట మీద నమ్మకము తోని మీ వోనిమీద కేసు గీసు లేకుండా మాఫీ చేస్తున్నా ఇకనన్నా బుద్దిగా ఉండ

మను” అంటు ఎంతో ఉదారంగా వ్యవహరించినట్టుగా మొఖం పెట్టిండు.

ఆ మొఖం చూస్తుంటే నాకు పెక్కటి లేని రోత పుట్టుకొచ్చింది. ఇదంతా దొంగ నాటకమని, వాడొత్త [illegible] వెదవని, అరిచి గీపెట్టాలన్నంత ఆవేశం తన్నుకొచ్చింది. అయినా తమాయించుకున్నాను.

లాకప్పు నుంచి మా అల్లున్ని తీసుకొచ్చిండ్లు జవాన్లు బాగా దెబ్బలు తినడం వల్ల మావోడు సరిగా నిలుచోలేని స్థితిలో ఉన్నాడు. వాన్ని చూస్తుంటే నాకు గుడ్లలో గబ గబ నీళ్లూరినయి. వాని జబ్బల క్రింద చేయిపోనిచ్చి వాడిసి పట్టుకొని స్టేషను బయటికితీసుకొచ్చాను బయట మా బావ గేటుదగ్గర మా కోసం కాపు కాస్తున్నాడు. మావొన్ని మా బావ చేతిలో పెట్టి, మారు మాట్లాడకుండా గబ గబా ముందుకు సాగాను.

“ఆగాగు మేము వస్తానం” అని వెనుక నుంచి మా బావ కేకేస్తున్నడు.. నేనా మాటలు పట్టించుకోలేదు.. నాకు ఏడుపు వస్తుంది.. కడుపులో ఎక్కడో చెయ్యి పెట్టి దేవినట్టుగా ఒక్కటే వికారము.... బిగ్గరగా ఏడిస్తే బాగుండునన్న కోరిక కల్గింది. కాని ఎలాగో తమాయించుకున్నాను.. ఎక్కడిదో పేరుకపోయిన కోపం, కసి నన్ను నిలువెల్లా దహించి వేస్తున్నది. అంతా కలగాపులగం అయిపోయినట్టుగా మనసంతా కకావికలం అయింది. నా కండ్ల ముందు తాగి తాగి నెత్తురు కక్కుకొని చనిపోయిన మా అన్న మొఖం కనిపిస్తున్నది. ముగ్గురు పిల్లలతో బ్రతకలేక బ్రతుకు ఈడుస్తున్న మా వదిన కనిపిస్తున్నది... అదిగో అక్కడ చల్లటి ఎయిర్ కండీషన్ గదిలో రౌండు టేబులు ముందు కూచొని మా సర్కిల్, ఎక్సయిజ్ కమీషనర్ లిడరు ప్రసాదు విందారగిస్తు పకపక నవ్వుతున్నారు. విచిత్రంగా వాళ్ళు కూచున్న టేబుల్ మీద వేయించిన మాంసం.... దాన్ని వాళ్ళు నంజుక తింటున్నారు. ఆ ప్రక్కనే విచిత్రంగా నేను తుపాకి పట్టుకొని వారికి కాపలాగా నిలుచున్నా. అక్కడి నుండి కదలాలని ఎంత ప్రయత్నించినా ఒక్క అడుగు కూడా నా పాదము ముందుకు కదలటం లేదు. ఏవో కనిపించని బంధనాలు నన్ను ఆవరించి ఉన్నాయి. నేను ఎంత పెనుగులాడినా అవి నన్ను కదలనియ్యటం లేదు. దూరంగా మంటలు లేస్తున్నాయి. ఒక్కసారి కళ్ళు జిగేల్ మనిపించే మంటలు. ఆ మంటలువిచిత్రంగా మేమున్న దిక్కే ఉప్పెనలా ముంచుకొస్తున్నది. భయంతో అరిచాడు ఎక్సయిజ్ కమీషనర్. లీడర్ నేలగా నెత్తినోరు కొట్టుకుంటున్నాడు. సర్కిల్ మొఖం నిండా భయంతో చెమటలు కమ్మినయి. ఆ మంటల్లో నుండి విచిత్రంగా మా అల్లుడు నడిచి వస్తున్నడు.

నా వొంటి మీద తేళ్ళు జెర్లు ప్రాకినట్టుగా ఉంది ఒక్కటే ఒక్కపోత. ఊపిరి సలుపనియ్యటం లేదు. ఊపిరి ఆగిపోతుందేమోనన్నంత బాధ నన్నావరించింది.

ఎలాగో ఇంటికి చేరుకున్నాను...→

# శ్రామిక బొంబాయి-మతోన్మాద బొంబాయి

**—కామ్రేడ్ పి. కె. మూర్తి**

హిందూ మతోన్మాదులు మసీదుని కూల్చివేసిన అనంతరం దేశం నలుమూలలా విధ్వంసం, మత ఉద్రిక్తతలు చెలరేగాయి. ఆ మత కలహాల్లో సామాన్యులు హతులయ్యారు. ఈ పరిణామాల్లో మినీ ఇండియా అనబడే బొంబాయి నగర పరిస్థితి గమనిస్తే భారతదేశంలో పరిస్థితి అర్థం కాగలదు.

**1960** ప్రాంతాలలో "జై మరాఠా" అనే ఉద్యమం పేరిట మరాఠేతర ప్రజలను ఏరి ఏరి వేటాడి చంపిన "ఉగ్రవాద మతతత్వ శక్తిగా శివసేన ముందుకొచ్చింది. ఈ శివసేనకు పునాది బొంబాయి నగర అండర్ వరల్డ్ మాఫియావర్గం. భారత పాలకులు అనుసరిస్తున్న అస్తవ్యస్త ఆర్థిక విధానాలు, సామ్రాజ్యవాద అనుకూల విధానాలు ఫలితంగా దేశం అంతా నిరుద్యోగ సమస్య రగిలినట్లే మహారాష్ట్రలో కూడా ప్రబలింది. అసంతృప్త దగ్ధ హృదయులైన మరాఠా నిరుద్యోగ యువకులను "క్షణికోద్రేక నినాదాలతో" ఆకర్షించుకుని శివసేన బలపడింది.

డిసెంబర్ 6 ఘటనానంతర పరిస్థితుల్లో శివసేన యొక్క దాడులు చాలా జుగుప్సాకరంగా వున్నాయి. మసీదు కూల్చివేతతో గాయపడిన హృదయాలతో కోపోద్రిక్తులయిన కొందరు ముస్లిం యువకులు రోడ్లపైకి వచ్చి కొన్ని దుకాణాలను, కార్యాలయాలను, బస్సులను తగులబెట్టారు. కానీ హిందువుల ప్రాణాల జోలికి రాలేదు. కానీ శివసేన దొరికినవారిని వివస్త్రులుగా చేసి, వారి పురుషాంగాల్ని పరీక్షించి, సున్తీ చేసి వుంటే ముస్లిములుగా నిర్ణయం చేసి సజీవ దహనాలు

→ఇంటిముందు బొగ్గుల కుంపటి. పొగలు చిమ్మి కణ కణ మండే నిప్పు కణికలై ధగ ధగలాడుతుంది.

నేనిక భరించలేకపోయాను. నాకు ఊపిరి సలుపని ఉక్కబోతగా ఉంది. వొంటిమీద పాకుతున్న తేళ్ళను జెర్రలను వదిలించుకోవడం కోసం, వోపికంత కూడ గట్టుకొని పట పట గుండెలు తెగిపోగా అంగి విడిచి కుంపట్లో వేసాను. దానినిండా ఎంతో మంది కుర్రోల్ల రక్తం మరకలతో బాటు ఇప్పుడు కొత్తగా సారా మరకలు. ఇన్ని ఏండ్లుగా నా వొంటిని అంటిపెట్టుకున్న ఆ కాకీ అంగి కుంపట్లో దగ్ధమైపోతోంది. నాకిప్పుడు ఎంతో హాయిగా వుంది.

"అయ్యో అయ్యో ఏమైందిబంగారం అటువంటి కొత్త అంగిని తగులబెడెతున్నవు. నీకేమన్నా పిచ్చి పట్టిందా" అంటు మా ఆవిడ ఇంట్లో నుండి ఉరికి వచ్చింది.

నాకు ఎక్కడ లేని నవ్వు వచ్చింది. గుండెలు అదిరి పోయేలా ఒక్కటే నవ్వు. తేలిగ్గా హాయిగా దూది పింజలా అయింది నా మనసు. ○

చేశారు. కార్మిక వాడలలో, బస్తీలలో, కాలనీలలో ఎలక్షన్ లిస్టుల సహాయంతోనో, ఇంకొక పద్ధతితోనో ముస్లింల ఇళ్ళను చాకపీసులతో గుర్తుపెట్టుకుని, రాత్రిపూట ఆ ఇళ్ళల్లోకి జొరబడి, చిందరవందర గావించి, బయటకు లాగి, వారి మెడకు స్కూటర్ టైర్లు తొడిగి నిప్పంటించారు. సూరత్‌లో ముస్లిం మహిళలను సామూహిక మానభంగం చేయడమే గాక శరీర భాగాలను కోసి చంపేశారు. ఈ "వీర" కృత్యాలను వీడియో తీసుకుని పైశాచిక ఆనందం పొందారు. మరాఠా పోలీసులు చూస్తూ ఊరుకున్నారు.

బొంబాయి అల్లర్లలో మూడొంతులు పైగా పోలీసు కాల్పుల వల్ల మరణించారు. మృతులలో 90 శాతం ముస్లిములే. ఆ శవాలను పరీక్షిస్తే బుల్లెట్ గాయాలన్నీ నడుముకు పై భాగానే వున్నాయి. 1960ల నుండి ఈ మధ్య వరకు ఉగ్రవాద హిందూ మతోన్మాద సంస్థ శివసేనలో పనిచేసి కరుడు గట్టిన యువకులే బొంబాయి పోలీసు శాఖలో భర్తీ అయి ఉన్నారు. అందుకనే బొంబాయి పోలీసులే శివసేన కార్యకర్తలుగా ముస్లిం వాడలపై దాడిచేసి, ఎంచుకుని (Target) కాల్పులు సాగించారు

బొంబాయి మహానగరానికి ఎంతో వైభవాన్ని శ్రామికులే కల్పించారు. ఒక్క మాటలో బొంబాయి కార్మికులది. ఒకనాటి బొంబాయి కార్మిక వర్గం బ్రిటిష్ వ్యతిరేక వీరోచిత పోరాటాలు చేసి, తూటాలకు గుండెలొడ్డారు. బ్రిటిష్ అనంతరం భారత పాలక వర్గాల కార్మిక వ్యతిరేక విధానలను నిరసిస్తూ చైతన్యవంతమైన పోరాటాలు చేశారు. 1985 నాటి టెక్స్‌టైల్ కార్మిక పోరాటం కూడా ఎంతో ప్రసిద్ధి చెందినది. అటువంటి కార్మిక బొంబాయి గురించి ఈ రోజు ఏం చెప్పాలి? ఆ బొంబాయి కార్మిక వర్గం ఇప్పుడెలా స్పందిస్తోంది? ట్రేడ్ యూనియన్‌ల పాత్ర ఏమిటో ఆత్మవిమర్శ చేసుకోవాలి. బొంబాయిలో "లార్సన్ & టూబ్రో" అనే కంపెనీలో, "మహేంద్ర & మహేంద్ర" కంపెనీలో ఉన్న బి. జె. పి. అనుబంధ ట్రేడ్ యూనియన్ అయిన బి.యం. యస్. "ముస్లిం కార్మికులకు పని ఇవ్వరాదు" అని కంపెనీ మెయిన్ గేట్ ముందు పెద్ద పెద్ద హోర్డింగులు పెట్టారు. జి.ఎమ్. లకు నోటీసులిచ్చారు. దానితో ఆ మేనేజిమెంట్లు ముస్లిం కార్మికులకు ఎటువంటి రక్షణ కల్పించలేమని చేతులెత్తేశారు. జెస్లోక్ హాస్పటల్‌లో 4వ తరగతి ఉద్యోగులలో ముస్లిం పనివారలను తొలగించాలని నోటీస్ ఇచ్చారు. ఇన్‌చార్జిగా ఉన్న ఒక పార్శీ డాక్టరు అలా చేయటానికి నిరాకరించారు. దానితో బి.యం.యస్. సమ్మెకు దిగారు. చూశారా....మిత్రులారా, సమ్మె అనేది తమ శ్రమను దోచే దోపిడీ వర్గానికి వ్యతిరేకంగా తమ కోర్కెల సాధనకై ఉపయోగించే ఒక ఆయుధం. అటువంటిది ఒక మతోన్మాద కోరికకు ఉపయోగించబడుతోంది.

ఇటువంటి పరిస్థితికి వ్యతిరేకంగా కార్యక్రమం తీసుకోవాలనుకున్నాం. బి.యం.యస్. మినహా అన్ని కార్మిక సంఘాలు వచ్చాయి. తీర్మానాలు చేశాయి. తీరా కార్యక్రమం రోజున "దత్తా సామంత్" (1984 నాటి టెక్స్‌టైల్ కార్మిక పోరాటంలో పేరుమోసిన నాయకుడు) వచ్చి "మా యూనియన్‌లో ఎక్కువమంది హిందువులున్నారు. ఈ కార్యక్రమానికి తీసుకురాలేనని చెప్పి వెళ్ళిపోయారు. సి.ఐ.టి.యు, ఎ.ఐ.టి.యు.సి. తదితర యూనియన్ నాయకుల స్థితి కూడా ఇందుకు భిన్నంగా ఏమీలేదు.

ఇటువంటి పరిస్థితి దాపురించడానికి కారణాలు ఏమిటో ట్రేడ్ యూనియన్ ఉద్యమం గుణపాఠం ఇప్పటికైనా తీసుకోవాలి. కార్మికులు లేకుండా కార్మిక ఉద్యమాలు లేవు. ఆ కార్మికులు ఏకం కావటానికి ఏ భావజాలం అడ్డుపడుతుందో, దానికి విరుగుడు ఏమిటో ఆలోచించాలి. గని కార్మికులంగా (సదస్సులోని వారిని ఉద్దేశించి నది) మనకు రెండు రకాల జీవితం ఉంది. బండకింద భూమిలోపల బొగ్గును తవ్వేటప్పుడు కార్మికుడిగా, ఆ షిఫ్టు పూర్తవ్వగానే సైకిలెక్కి చేరుకుంటున్న ఇల్లు, కుటుంబం, కాలనీ పేట వాటి మధ్య జీవితం ఉంది. మన ట్రేడ్ యూనియన్లు పనిచేసే చోటకి చెందిన సమస్యలపై కార్యక్రమం తీసుకుంటున్నాయి. కానీ అతని ఇల్లు, ఇంటి చుట్టూ ఉన్న పరిస్థితుల్లో ఏం చెయ్యాలి అనే కార్యక్రమం ఎమీ ఇవ్వటం లేదు. మతోన్మాద సంస్థలు మాత్రం ఆయా కాలనీలలోకి యువజన సంఘాలు, ఆటల క్లబ్బులు, మహిళా సంఘాల పేరిట జొరబడి, రకరకాల ఆచారాలకు చెందిన కార్యక్రమాల ద్వారా "సతీ సావిత్రీ కథా కాలక్షేపం" అనో "గాయత్రీ మంత్ర ఫలం అనో అనేక ధార్మిక కార్యక్రమాలలో మన ఇంటి కుటుంబ సభ్యులను, ఆఖరికి ఆ కార్మికుణ్ణి కూడా ఆ భావజాలంలోకి లాగుతున్నారు. ఒక్కసారి తరిచి చూసుకోండి. జీతాలు పెంచమనో, వేజ్ బోర్డు అమలు పరచమనో, బోనసులు చెల్లించమనో మనం చేసే ఊరేగింపుల్లో తమతమ భార్యలను, కుటుంబ సభ్యులను తీసుకు వస్తున్నారా ?

అందుకే కార్మికులు ట్రేడ్ యూనియన్ కేవలం తను పనిచేసే ప్రాంతానికే పరిమితం చేయరాదు. తన ఇంటికి, కాలనీకి, పేటకుకూడా విస్తరింప జేయాలి. లేకపోతే రాముడి పేరుమీద "రామరాజ్యం" ఏర్పాటు చేస్తామంటున్న మతతత్వవాదులు ఈ రోజున ముస్లిములకు వ్యతిరేకంగా ఉన్నట్లు కనబడవచ్చు. ఆ తరువాత కమ్యూనిస్టులపైకి ఆ తరువాత ట్రేడ్ యూనియన్లపైకి, ఆ తరువాత దళితులపైకి ఆ

(భారత కార్మిక సంఘాల సమాఖ్య (IFTU) ప్రధాన కార్యదర్శి కా॥పి.కె. మూర్తిగారి ఉపన్యాస భాగం. అనువాదకుడు : ఉదయ్.)

# అస్తమించని సూర్యుడు

అలిశెట్టి ప్రభాకరా
అస్తమించని సూర్యుడా
కన్నీటి బతుకుల కవితల్లి
కాగడాపై మండినావా ||అ||

జగిత్యాల పోరునుండి
స్ఫూర్తినొంది కలం ఎత్తి
మంటలా జెండాలు ఎత్తి
దొరతనా న్నెదిరించినావు
దోపిడిపై చురకలిసిరి
కవిత కత్తుల ఝుళిపినావు ||అ||

అక్షరాలను లక్షలాది
పీడితలకే ధారపోసి
పిడికెటి మట్టిని నీవు
మైదానం చేసినోడ
పోరు కవిత కెరటాలనే
యుద్ధనౌకగ తీర్చినోడ ||అ||

కల్లోల జిల్లానుండి
కాలుష్య నగరాని కొచ్చి
నగర జీవిత యాంత్రికాన్ని
'సిటీ లైఫ్'గా మార్చినోడ
అరణ్యాలనే ఆయుధంగా
కుంచె బట్టి సంధించినోడ ||అ||

పచ్చ పచ్చని ఆకులేమో
నీరు లేక రాలినట్లు
రేత లేత పిందెలాను
పురుగు చేరి తొలిచినట్లు
టి. బి. రోగం నీలో చేరి
బతుకునే కలిగించినాదా ||అ||

పేదతనమే అడ్డమొచ్చి
బతుకు తెరువు భారమైనా
నెత్తురంతా రంగు చేసి
చిత్రాలనే గీసినారా
కంటిపాపలు కరిగిపోయినా
కెమెరా క్లిక్కు ఆపనోడ ||అ||

చావు నీకు దగ్గరుందని
తెలిసి కూడా జంకలేదు
ఊపిరాడని స్థితిలో కూడ
అక్షరాలనే పేర్చినావు
కలలో కూడా కవిత తలచి
[illegible]ల రాసినావు ||అ||

నిత్యమూ నీవు కలలు గన్న
సమాజాన్ని తెచ్చేవరకు
కలాలన్నీ ఒకటి జేసి
గళాలెత్తి పాడుతాం
పోరుబాటలో కవితలై
చిరంజీవిగ నిలుస్తావు
అమర్ హై అమర్ హై
అలిశెట్టి ప్రభాకర్ అమర్ హై ||అలిశెట్టి||

—ప్రవీన్

(కా|| అలిశెట్టి ప్రభాకర్ కోసం)

గల్పిక :

# గిరిజన సంక్షేమం

—కృష్ణ

'మహాప్రభో ! గిరిజనుల భూముల్ని గిరిజనేతరులు మోసం చేసి దోచుకున్నారని గిరిజనులు' ఆందోళన చేస్తున్నారు.'

'ఎంత అక్రమం ! మనం గిరిజనుల హక్కుల్ని కాపాడవలసిందే ! నేటి నుంచి గిరిజనులు భూముల్ని గిరిజనేతరులు ఏ విధంగానూ తీసుకునే వీలులేదు. ఇది మా ఆజ్ఞ ! దీనిని ధిక్కరించినవారికి శిరచ్ఛేదనం తప్పదు !'

o—o

'మహామంత్రీ ! మా ఆజ్ఞను ఎవ్వరైనా ధిక్కరించితిరా !'

'ఎంతమాట మహాప్రభో ! మీ ఆజ్ఞ శిలాశాసనం. కాని—'

'ఏమది ?'

'ఆజ్ఞ అమలయ్యే నాటికి గిరిజనులకు సెంటు భూమికూడా మిగలలేదు !

'ఈ విషయం సామంతులతో చర్చించి తగు నిర్ణయం తీసుకుంటాం !!

oo oo oo

'మహారాజా ! గిరిజనులు ఉత్పత్తి చేసిన సరుకుల్ని వ్యాపారులు మోసం చేసి చవకగా కొని, వారికి కావలసిన వస్తువుల్ని ఎక్కువ ధరకు అమ్ముతున్నారని గిరిజనులు ఆందోళన చేస్తున్నారు.

'ధర్మం నాలుగు పాదాలా నడిచే నా రాజ్యంలో మోసమా ! వెంటనే సహ వస్తుసేకరణ సంఘాల్ని పెట్టి గిరిజనులు ఉత్పత్తుల్ని సరసమైన ధరలకు కొనండి '

'మరి అటులైన ఇప్పుడున్న వ్యాపారులు ఉపాధి కోల్పోవరా మహాప్రభూ !!'

'అది ఎన్నటికీ జరుగదు. మా రాజ్యంలో ఏ వ్యక్తికీ అన్యాయం జరగకూడదన్నదే మా విధానము. అట్టి వ్యాపారస్తులు మనం నిర్వహించే సహకార వస్తు సేకరణ కేంద్రంలో వాటాలు కొనుగోలు చేసుకోవచ్చునని ప్రకటించండి ! ప్రభుత్వానికి అనుభవం లేని దృష్ట్యా వ్యాపారంలో తగు సలహాలు కూడా వారు ఇవ్వవచ్చును. అందుకు తగ్గ పారితోషికం కూడా ఉంటుందని కూడా ప్రకటించండి !'

-o-

(55 వ పేజీ తరువాయి)

పోయేదేమీ లేనోళ్ళం (కవితా సంకలనం) శంబుక, పేజీలు - 64, వెల - రు. 12-00; ప్రచురణ : దళిత విమోచన సమితి; ప్రతులకు : ప్రగతి బుక్ హౌస్, మ్యూజియం రోడ్, విజయవాడ.

# స్వీకారం

1. రవీంద్ర గీత - రవీంద్రనాథ ఠాకూరు; కవితలకు పద్యానువాదం - అనువాదకులు - కొంగర జగ్గయ్య-పేజీలు 200; వెల . తెలీదు; ప్రచురణ; విద్యా వేదిక, మద్రాసు.
2. రైతు రాగం (గేయకావ్యం) - మణిమేల నాగేశ్వరరావు: పేజీలు : 114; వెల : రు. 7-00; ప్రచురణ : రాజా పబ్లికేషన్స్, 13/107, జగన్నాథ పురం, గుడివాడ (కృష్ణా జిల్లా)
3. దళిత కళామండలి పాటలు, సం`దకుడు - మాస్టార్జీ; పేజీలు - 42, వెల- రు. 6-00; ప్రచురణలు - ఆంధ్రప్రదేశ్ దళిత మండలి, హైదరాబాద్. ప్రతులకు : స పాదకులు - చంద్రహాస, 2-4-107, మచ్చబొల్లారం, సికింద్రాబాద్-500010. (తరువాయి 54వ పేజి)

---

( 8 వ పేజీ తరువాయి )

అక్కడ పేదలందరికీ గృహ వసతి కల్పించారు. సంక్షేమ కార్యక్రమాల ద్వారా సహాయం అందుతుంది. చాలా మందికి కార్లు వున్నాయి. కారు కొనుక్కోవడం అక్కడ పెద్ద విషయమేమీ కాదు. సాధారణ శ్రామికుడి మూడు వారాల కూలీతో ఒక సెకండ్‌హాండ్ కారు కొనుక్కోవచ్చు.

అమెరికాలో ఒక వైపు మధ్య తరగతి తెల్లజాతి వారూ-మరోవైపు కూలిపోబోతున్న మురికివాడల్లో నివసిస్తున్న నల్లజాతిప్రజలు-నేరస్తులు, మత్తు మందుల బానిసలు కనబడ్తారు. తెల్లజాతి అమెరికన్లకు అంతులేని అవకాశాలు, శ్రమపడితే ఏమైనా సాధించవచ్చు - ధనికులు కావచ్చు, ప్రముఖులు కావచ్చు - దేశ అధ్యక్షుడేకావచ్చు కాని నల్లజాతి వారికి అధ్యక్షులైనే కావచ్చునన్న మాట నమ్మరు. వారు ప్రస్తుతంవున్న స్థితికి భిన్నంగా పరిస్థితులు మెరుగవుతాయన్న ఆశ వారికి ఏమూలా లేదు. ధనికులు మరింత ధనికులుగా మారుతున్నారు. సంపద బీదవారిని ప్రక్కకు తోసేసింది. అతి తక్కువ అభివృద్ధి. సంక్షేమ పథకాల ద్వారా వచ్చే సదుపాయాల మీద బతకడం తప్ప ఇతర అభివృద్ధి పథకాలేవీ లేవు.

ప్రస్తుతం అమెరికా ప్రపంచంలో ఋణగ్రస్త దేశాల్లో ప్రథమస్థానం అలంకరించి వుంది. అది నేరస్తులతో, నేరాలతో లుకలుకలాడుతున్న దేశం. ప్రపంచంలోని లాయర్లలో 2/3 వంతు లాయర్లు గల లిటిగెంట్ సమాజం అది. ఇంతమంది వున్నా సాధారణ పౌరుడు కోర్టుకు వెళ్ళగల్గిన స్థాయిలేని దేశం. ప్రపంచంలోనే అది ఆరోగ్యం కోసం అత్యధికంగా ఖర్చుపెడ్తున్న దేశం-అయినా సగటు జీవిత స్థాయిలో ప్రపంచంలో 16వ స్థానం దీనిది. శిశు మరణాలలో 23వ స్థానం. అమెరికన్లు ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే కొకైన్ అనే మాదక ద్రవ్యాన్ని 50 శాతం వాడుతున్నారు. ఇదండీ అమెరికా నిజ స్వరూపం. ఇదే మనకు ఆదర్శమని నమ్మమంటున్నారు !

## చైతన్యవాహిని :

### అరుణోదయ, విజయవాడ దళం :

* సారా వ్యతిరేక ఉద్యమ కమిటీలో 16 ప్రజాసంఘాలతో భాగస్వామిగా 'అరుణోదయ' పాల్గొని విజయవాడలోని వివిధపేటలలో ప్రచారంలో సారా వ్యతిరేక పాటలు పాడారు. జనవరి 8న 'పైప్రిజర్‌పేట'లో చర్చి ముందు గ్రూప్ మీటింగు నిర్వహించి "శబ్దం" వీధి నాటకాన్ని ప్రదర్శించారు.

* జనవరి 10 న అరుణోదయ, నవ భారత యువజన సంఘం (NYO) ఆధ్వర్యంలో క్రీస్తురాజపురంలో సారా వ్యతిరేక ప్రచారంలో భాగంగా "శబ్దం" వీధి నాటకం 350 మంది ప్రేక్షకుల ముందు ప్రదర్శించారు.

* విప్లవ రచయితల సంఘం గుడివాడలో నిర్వహించిన సాహిత్య పాఠశాలలో జనవరి 11న అరుణోదయ సాంస్కృతిక ప్రదర్శనలిచ్చింది. కులోన్మాదానికి, మతోన్మాదానికి వ్యతిరేకంగా, అధిక ధరలకి వ్యతిరేకంగా పాటలు పాడారు. "రామజన్మభూమి కాదురో" వీధి నాటిక ప్రదర్శించారు.

* కృష్ణా జిల్లా ఉయ్యూరువరం గ్రామంలో 22వ తేదీన రైతుకూలీ సంఘం, నిర్వహించిన సారావ్యతిరేక బహిరంగసభలో ప్రదర్శించిన "శబ్దం" నాటకాన్ని ప్రజలు ఎక్కువ సంఖ్యలో చూశారు.

* కరీంనగర్ జిల్లా, శ్రీరాంపురంలో (మంచిర్యాల) గోదావరిలోయ బొగ్గుగని కార్మికసంఘం 4వ మహాసభ జరిగిన కామ్రేడ్ శంకర్‌గుహ నియోగీ నగర్‌లో జనవరి 29న "రామజన్మభూమి కాదురో" నాటకాన్ని విజయవాడ దళం, 30న "శబ్దం" నాటకాన్ని గోదావరిఖని అరుణోదయదళం ప్రదర్శించారు. 28న జరిగిన మహాప్రదర్శన అగ్రభాగాన అరుణోదయ కళాకారులు వేషాలతో, డప్పు నృత్యాలతో సాగారు. బహిరంగ సభలో విప్లవగేయాలు పాడారు. గోదావరిఖని దళం "బొగ్గుబావి బాగోతం" ఒగ్గుకథలోని కొన్ని భాగాలు ప్రదర్శించారు.

---

(3వ పేజీ తరువాయి)

లతో తిరిగివచ్చే వాళ్ళకిపే ఎదురుచూపులు" అన్న "సూర్యతేజ"గారి కవితలో క్రొత్త ప్రయోగం కన్పించింది. సారాపై పాటలు అన్ని కోణాలనుంచి సమస్యను వివరిస్తూ సంఖ్యలో ఎక్కువగా ప్రజాసాహితిలోనే వచ్చాయి. డిసెంబర్ సంచికలో శ్రీకాంత్, దివికుమార్ గార్ల "మతతత్వం"పై వ్యాసాలు చాలా విలువైనవి. గుంటూరు, విజయవాడ, హైదరాబాద్ నగరాల్లో 'రోజా' సినిమా చూసిన ఎ.బి.వి.పి. తదితర మతోన్మాద సంస్థలు ముస్లిం జెండాలను, పాకిస్థానీ జెండాలను తగులబెట్టడం చూస్తే ఆ సినిమా సమీక్ష వ్యాసం సరైన టైములో, వివరంగానే వచ్చిందని పించింది. ప్రజాసాహితి కృషి వేగవంతమూ, శక్తివంతమూ.

గుంటూరు — ప్రభాతసూరి

# నమ్మకం మందు కాదు

కాషాయాంబరాలు ధరించేటంత పాపాలెప్పుడు
చేసేశాడీ మనిషి ? చూడబోతే నిండా లేవు
నలభయ్యేళ్ళు ! అవునులే ఇకపై కేలండర్లు
ఎన్ని చీకట్లను ప్రసాదిస్తాయో అన్ని చేయొప్పి కిల్బిషాలు !
ఇంద్రియాల్ని గెలిచేశానంటాడు ! మరి ఆ ముక్కు
మీద కోపం ఏమిటి? చూపుల్లో ఆకర్షణ ఏమిటి ?
ఆ పెదవుల మూలల విరుపులేమిటి ? నొసట
తిలకం ధరించే ముందు నిలువుటద్దాలెందుకు ?
చూడబోతే నిండా లేవు నలభయ్యేళ్ళు !
ఎప్పుడు ఎక్కడ ఏకాగ్రత సాధించి వచ్చాడు ?
ఏకాగ్రత ఉందో లేదో పరీక్షించడానికి
అవకాశం ఇవ్వని ఆ గర్వరేఖ లెందుకు ?
ఏమో ఇతడ్ని పూర్తిగా నమ్మి వెడితే
చివరికి ఈ జనాలకు మిగిలేదేమిటి ?
"ప్రజలారా అశాశ్వతం ఈ తనువు వినండి
కోరికలు వీడండి సొమ్ములన్నీ త్యజించండి"
"నన్ను నమ్మారా మీకు భవరోగం మానుతుంది"
అంటూ మొదలెట్టే ఈ మనిషిని పరిశీలించండి
నిర్ణయాలను నమ్మకాలతో ముడి పెట్టకండి

—డా॥ మిరియాల రామకృష్ణ